# విషయసూచిక



**వర్ణచిత్రము: 'మదయంతి'**




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

---

# మదయంతి

గీ. మాలతీ మాధవంబులో మార్పులేక నాఁటిసిద్ధాంతముల నెల్ల పాటవమున
నచ్చుగ్రుద్దిన భవభూతి యాశయంబు చిత్రితంబయ్యె మదయంతి పాత్రయందు.

ఉ. పువ్వులఁబోలు నంగములు పొల్పెసలారఁగ రాగమాలికల్
నవ్వులవెన్నెలై నవవిలాసము దోఁపఁగ మందయానయై
క్రొవ్విరిగంధి దానచటకుం జనిమ్రోఁ మదయంతి మాలతీ
పువ్వులఁగోయు వ్యాజమునబూని మరందునిఁ జూచు వేడ్కతోఁ.

గీ. సరసఁబెరిఁగిన పూపొద చాటునుండి స్వాధుమధురోక్తు లెన్నియో సంభ్రమమున
వరలదొడిగెను భావనాభరితమగుచు ప్రకృతిసహజంబకాదె! యీ ప్రణయరసము.

—కవికలహంసి, చేబ్రోలు సరస్వతీదేవి.

# —ఀ స్త్రీ వాఙ్మయము ఀ—

సచ్చిదానంద స్వరూపుడైన పరమాత్మ ప్రపంచసృష్టి సంకల్పించిన నాడే స్త్రీ యున్నతస్థానము వహించినది. సర్వసృష్టికి ప్రకృతియే మూలము. ప్రకృతియే ఆదిజనని. సత్వరజస్తమోగుణ నిర్ణయ విభాగ మనుసరించి సరస్వతి, లక్ష్మి, పార్వతి యను వేర్వేరు నామరూప మాత్రభేదములతో నా ముగురమ్మల మూల పుటమ్మ 'చాల పెద్దమ్మ' వెలయుచున్నది. సకల కళాజ్ఞాన స్వరూపిణికి సరస్వతియనియు, శౌర్య, ధైర్య, గాంభీర్య, సాహసాది శక్తి స్వరూపిణికి అంబికయనియు నిర్ణీత నామధేయములు వాడుకలో నున్నవి.

సకల సస్యసంపదయు, మణిరత్న సంపత్తియు నిచ్చు భూదేవియు స్త్రీ స్వరూపిణియే కదా! అనంతకోటి సంఖ్యాకములగు జీవరాసులకెల్ల నాధారభూతమును, ప్రాణభూతమునునగు గంగాస్రవంతి మున్నగు పావనజీవ నదీమతల్లులకును స్త్రీవాచక మొసంగబడియున్నది. కోరిన కోర్కెలనిచ్చు కామధేనువు స్త్రీ రూపధారిణియే, భగవతావతార స్వరూపోచ్చారణ సమయమందును సీతారాములనియు, పార్వతీ పరమేశ్వరులనియు, లక్ష్మీ నారాయణులనియు స్త్రీ నామములే ముందుగ చేర్కొనబడుచున్నవి. ఇందులో గల మాహాత్మ్య మెట్టిదో!

ఈ ప్రకృతి స్వరూపిణియే లలిత, పరదేవతా, దుర్గ, కాళిమున్నగు సహస్ర నామములతో గొలువబడుచున్నది. ఈ జగజ్జననిని నవరాత్రులలో సత్యమెఱింగిన మహానుభావులు, ఆత్మబలసిద్ధికై, మోక్ష ప్రాప్తికై పూజించికొనియాడుచుందురు. సామాన్యజనులు ఐహిక సుఖముగోరి యర్చించుచుందురు. ఈ ఆది శక్తియే వేదమాతయగు గాయత్రీదేవి. ఉపనయన మహోత్సవ సమయమందు బ్రహ్మచారులు గాయత్రీమంత్ర మును స్వీకరించి ద్విజత్వసిద్ధియు, వేదాధ్యయనాధికారమును బొందెదరు. అనగా వేదాభ్యాసమునకును, విద్యాభ్యాసమునకును ఇదియే తొలిమెట్టు. పురుషులకువలెనే స్త్రీలున్ను ఉపనయన సంస్కారమునంది, వ్యక్తిగత జీవనవృద్ధికిని, జాతీయ జీవనవృద్ధికిని ప్రధానమైన బ్రహ్మచర్య మనుష్ఠించి సంపూర్ణ జీవనమునకు దగిన ప్రజ్ఞా విశేషమును వడసియుండిరి. అది స్వర్ణయుగము. అప్పటి స్త్రీలు పరిపూర్ణ విద్యావతులై స్వధర్మ ములను, స్వాతంత్ర్యమును నిలబెట్టిరి. కొందరు వాఙ్మయ నిర్మాణమునకై తమ పవిత్రజీవితమంతయు ధారవోసి విజ్ఞాన లోకమునకు మార్గదర్శకులై ఋక్కులలో సయితము తమ ప్రతిభా విశేషమును ప్రతిష్ఠింపజేసిరనిన, ఆనాటి స్త్రీ వాఙ్మయమెట్టి యుత్తమస్థానమును వహించియుండెనో వేరుగ చెప్పవలయునా?

దీనినిబట్టియే భారతదేశము ధార్మిక సంపదయందు పొందిన యౌన్నత్యమును గుఱించి ఇప్పుడును స్వదేశస్థులేగాక విదేశస్థులు సహితము ప్రశంసా పూర్వముగ ముచ్చటించుచున్నారు. భారతీయులు ఆధ్యాత్మిక జీవనమునకే అధిక ప్రాముఖ్యతనిచ్చి ధర్మతత్పరులై యున్నను ప్రాపంచికైశ్వర్యములందును ఉచ్చస్థితి యందుండిరి. ఇట్టియున్నత దశకు మూలకారణము స్త్రీ స్వరూపమేయనుట యతిశయోక్తికాదు.

కాలవాహిని చర చర సాగిపోవుచుండగా మానవులలో నాచార వ్యవహారములు ఎప్పటి కప్పుడు మారిపోవుచుండునుగదా! అట్టిచో వాఙ్మయ ప్రపంచమున నారీరత్నములకున్న స్థానము క్రమ క్రమముగా క్షీణించి నామమాత్రావశిష్టమయ్యెను. మరల ఆతుకూరి మొల్ల, తరిగొండ వెంకమాంబ, ముద్దుపళని మొదలగు కవయిత్రీమణుల శంఖారావములు చెలరేగువరకును స్త్రీ వాఙ్మయమెట్టి పరిణామమునొంది యుండెనో ఇదమిద్ధమని నిర్ణయింపబడి యున్నట్లు ఆధారములుగానరావు. ఇందులకు ప్రధానకారణము భారతసామ్రాజ్య సౌభాగ్యమును గోలుపోయి పరదేశీయుల పాలనలో బడియుండుటయే.

నవయుగవాతావరణమున భారతీయులు పాశ్చాత్య వ్యామోహమున మునింగి యుండుటచే పరంపరగావచ్చు వేదవిద్యాభ్యాస మడుగంటుటయు, తపశ్శక్తులు నశించుటయు, ఆధ్యాత్మిక చింత సన్నగిలుటయు, సంస్కృతభాషా పరిచయ మతి విరళమగుటయు, సంభవించి మన పవిత్రధర్మములు చెడి మనకింత యధోగతి పట్టినది. మన పవిత్రధర్మమును పునరుద్ధరించు సమయమిప్పుడా సన్నమైయున్నది. మనమొకప్పుడుండిన యున్నతినే పరమాశయముగా నెంచి దానినందుటకై శక్తివంచనలేక ప్రయత్నింప వలయును.

స్త్రీలు అబలలుకారనియు, సర్వకళా నిపుణులనియు, ధీరగుణాఢ్యలనియు విశేషించి లలితకళలన్నియు స్త్రీల సొమ్ములనియు, ఎట్టికష్టసమస్య వచ్చినను వెనుకంజవేయరనియు లోకమంగీకరించిన విషయమే. నాడు నాటికి ప్రపంచ నాగరికతాభివృద్ధి ననుసరించి నేటి సతీమతల్లులు విద్యాభివృద్ధి కలిగియున్నారనుట నిర్వివాదాంశము.

సుమారు 20 ఏండ్ల నాటి స్త్రీలకును నేటి స్త్రీలకును చాలా వ్యత్యాసమున్నది. సంఘసంస్కరణమనినను, రాచకీయమనినను నాటి స్త్రీలు భయకంపితులగువారు. నేడో? ముందంజవేయుచున్నారు. ముదిముచ్చట్లు, పుక్కిటి పురాణములతో ప్రొద్దు పుచ్చక నేడాంధ్రవనితలు చక్కని పద్యములను, రసవంతములగు గద్యములను వ్రాసి వన్నెకెక్కుచున్నారు. సంఘసేవయందును పురుషులకంటె స్త్రీలు పనిచేయగలవారున్నారు. సాహితీ సేవయందును పురుషులకెందును దీసిపోక దీక్షవహించి పాటుపడుచున్నారు. కాని రచనయందును వాఙ్మయ సేవయందును పేరుగాంచి, సాహితీరంగమున నగ్రస్థానముల నధిష్ఠింప గోరువారు లెక్కకుమిక్కిలి తక్కువనియే చెప్పవచ్చును. ఆంధ్రదేశోద్యాన వనవాటికలో ఆంధ్రవాఙ్మయారామములో స్వేచ్ఛగ సంచరించుచు భారతదేశ సౌభాగ్యమున కనువగు మార్గములెన్నియో పురుషులతోబాటు స్త్రీలుసు కనిబెట్టు చున్నారు. అందులో చరచర ముందున కడుగులువేయు, కనుపర్తి, కాంచనపల్లి, గుడిపూడి మున్నగు సోదరీమణులు పేర్కొన దగినవారు. -

కాలపరిస్థితులును, దేశపరిస్థితులును, చిరసంప్రదాయములును కలిసి ఆదర్శ చరిత్రమును ప్రజ్వలింప జేయును. ప్రాచీన భారత సారస్వతమును పరిశీలించితిమేని ధర్మశాస్త్రములందు నిరూపింపబడిన ఆదర్శ స్త్రీ లక్షణము లెన్నెని గోచరించును.

ప్రస్తుత స్వాతంత్ర్య యుగమున మనమట్టి ఆదర్శ స్త్రీచారిత్రమును నిలబెట్టవలయుననిన గృహధర్మ, సంఘధర్మ, జాతిధర్మములను నిర్వహించుటకు నాధారమైన విద్య స్త్రీలకవసరము. అన్ని నాగరికతలు గృహమున బుట్టునవియే. భావబంధురమైన గృహధర్మమందున్నతి కావలెననిన సోదరీమణులందరు మాతృభాషకే ప్రాధాన్యమిచ్చి సారస్వతసేవికలై వివిధాంగణము లందగ్రస్థానములను నలంకరించ ప్రయత్నించవలెను. భారతమహత్వమును పునరుద్ధరింపగల యాశయములు, ఆదర్శములు, మాతృభాషయందును దానికి ప్రియసఖియగు సంస్కృతమునందును గోచరించును, గాని అన్యభాషలందుగాదు. మాతృప్రేమధారలు తల్లిపాలలో నుండియే గురియునుగాని పోతపాలలోగాదు.

"జననీజన్మ భూమిశ్చ స్వర్గాదపిగరీయసీ" అను పవిత్రవాక్కుల ననుసరించి స్వదేశ గౌరవమును, స్వదేశాచారసాంప్రదాయములను నిలుపుకొనవలయును. దేశకాల పరిస్థితుల గమనించి, పరిపాలకులనరసి, వ్యవహారదక్షతకొఱకు పరభాషయు, పరవాఙ్మయమును యభ్యసించి అందలి జ్ఞానము సంపాదింపవలయును. వివేకదృష్టితో నందలి గుణాగుణములను గమనించి సారము గ్రహించుట శ్రేయస్కరము.

హృదయ గర్భమందలి స్వతంత్రశక్తిని, సహజమైన ప్రజ్ఞను, ప్రతిభను వెలువరింపజేయుటే కదా విద్యయొక్క ప్రధానోద్దేశము? వనితాజనమునకు సహజాలంకారమగు దయాసత్యశౌచశాంత వాత్సల్యాది సద్గుణజాలములు సందీపింపజేయు విద్యకే ప్రాముఖ్యతనిచ్చి భావిభారత కల్యాణమునకు పునాదివేయవలయును. పరవాఙ్మయ సంచరణమునందుమునిగి నవనాగరికతా వ్యామోహమున కొట్టుకొనక, స్త్రీలు తమ కర్తవ్యమును జ్ఞప్తియందుంచుకొని ప్రస్తుత క్లిష్ట పరిస్థితులలో, ప్రపంచభావి నాటకరంగములో మన భారతదేశము ధరించబోవు పాత్రానుగుణ్యముగ మన జాతీయవిద్యా సౌధమును నిర్మింపవలయును. మాతృభూమిని ప్రేమించుట ఆ ప్రేమలోనే ఆనందమనుభవించుట ప్రతి మహిళామణికిని నిసర్గలక్షణము గావలెను. దీనికి లలితకళావ్యాప్తి జాతీయ విద్యాభ్యసనము, మూలసూత్రములు.

నేటి స్త్రీ విద్య మన పవిత్ర ధర్మముల నుద్బోధించునది కాదనుట తేటతెల్లము. ఈ మార్గములో నడుగులు వేయువారు, నేర్వవలసినవిద్య, నడువవలసిన మార్గము, చేయవలసిన కర్తవ్యము అవలంబింపవలసిన విధానమెఱుంగక సందిగ్ధావస్థయందుబడి యొక్కొక్కసమయమున కళంకమునుకూడ దెచ్చుకొనుచున్నారు. కావున నేటి సభ్యతయందలి విడ్డూరముల విలోకించి, సోమరితనమును, విచ్చలవిడినడవడియు అరిష్టదాయకములనిరోసించి భారతప్రాచీన సభ్యతనే గమ్యస్థానముగా గైకొని దానికివలయు విజ్ఞానమును, వాఙ్మయమునే సంపాదింప ప్రతియువతీమణియు ప్రయత్నించవలయును.

జాతీయతకును వాఙ్మయమునకును అవినాభావ సంబంధమెల్లకాలములోను నుండక తప్పదు. పరిశీలించి చూచితిమేని ప్రస్తుతయుగమున నేటివరకును స్త్రీవాఙ్మయ మిట్టిదని సృజించు పుణ్యమునకు నోచుకొనలేదు. తొక్కు కవితలును, కండకావ్యములును వెలువడినంత మాత్రముననే సంపూర్ణ వాఙ్మయము కానేరదు. రచనయందును సాహితీలక్షణమందును సిద్ధహస్తులైన సోదరీమణులుండియు స్త్రీలకు సంబంధించిన వాఙ్మయముగాని స్త్రీలచే నిర్మింపబడిన వాఙ్మయముగాని కాగడాలతో వెదకినను కానరాకపోవుట శోచనీయము. భావిభారత సారస్వతసేవకులు ఈ లోపమును గ్రహించి నిస్పృహజెందవలసినదేనా? ఎంత దురదృష్టము! స్వాతంత్ర్య యుగవాతావరణములలోనుండి, ఉత్తమాశయముల కుబలాటపడుచున్న మన మికనైనా కనులువిప్పి కర్తవ్యము గ్రహించి స్త్రీ వాఙ్మయ నిర్మాణమునకై దీక్ష బూనవలదా?

—కవికలహంసి, చేబ్రోలు సరస్వతీదేవి.

# భజన సమాజాలు - స్త్రీజన కర్తవ్యం

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ

**జాతినిత్యం, మానవజీవితం అనిత్యం గనుక, మన జాత్యభ్యుదయం నిమిత్తం మనవంతు సేవాధర్మం మనం నిర్వర్తించాలె. స్త్రీ విశ్వకుటుంబినియై గృహంతోబాటు దేశసముద్ధరణానికి కూడా తోడ్పడాలి. 18 కోట్ల భారత మహిళామణులు అజ్ఞానతమస్సులో ఉన్నన్నాళ్లు భారతదేశానికి విముక్తి లేదు; కల్యాణం లేదు.**

---

మనదేశంలో స్త్రీ సమాజాలే చాలాతక్కువ. అందులో ప్రార్థనాసమాజాలనబడేవి రెండుమూడుకన్న అధికంగా లేవు. అయితే రత్నంయొక్క విలువ సంఖ్యనుబట్టీ ఉండదు, పరిమాణాన్నిబట్టీ ఉండదు. వాని ప్రాశస్త్యాన్నిబట్టే ఉంటుంది. ప్రార్థన అనగానే అది భగవత్పరమైన సంస్థ అని స్ఫురిస్తుంది. ప్రార్థన మానవుని సర్వవిధాలా పునీతమొనర్చి భగవత్సాహచర్యం గల్గించే దివ్యసాధన. పవిత్రమైన కృష్ణవేణీ జలావగాహనంచేస్తే దేహమాలిన్యమే నివర్తికావచ్చును. ప్రార్థనచేస్తే మనోవాక్కర్మంబులు మూడింటా మానవులు పరిశుద్ధులౌతారు. ఇనుము అయస్కాంతం దెసకు ఆకర్షితమైనట్లు ప్రార్థనాశీలి చిత్తం భగవంతుని దెసకు ఆకర్షితమౌతుంది. ఎవరైతే భగవత్ప్రార్థనను అనుదినవ్రతంగా పెట్టుకొంటారో వారికి భగవత్సాన్నిధ్యం సులభమౌతుంది. ప్రార్థన నటనావినోదం గాదు. వాగాడంబరం గాదు. మనోవిలాసం గాదు. దైహికవాచిక మానసికదోషములనెల్ల వారించి ఏకాగ్రచిత్తం కలుగజేసి పరమాత్మానుసంధానం ప్రాప్తింపజేసేదే ప్రార్థన. ప్రార్థనాశీలికి సర్వవిషయములందును భగవదర్పితబుద్ధి యేర్పడడం, కష్టసుఖాది ద్వంద్వములయందు సాక్షిమాత్రుడుగా ఉండటం, నిష్కామకర్మయోగి కావడం స్వభావమౌతుంది. ప్రార్థనవల్ల యెట్టి ఆధ్యాత్మికబలం యేర్పడేది, యెట్టి మహత్తర కార్యనిర్వహణాశక్తి సమకూడేదీ, ఎట్టి జగద్వశీకరణ సామర్థ్యం కలిగేది, నేడు మహాత్మగాంధీగారివల్ల మనము తెలుసుకుంటూనే ఉన్నాము. మానావమానముల క్లేశము, జయాపజయముల వేదన, కలిమిలేముల రాపిడి, దూషణభూషణల కలత, తారతమ్యముల వ్యత్యస్తములేక వీనికన్నిటికి అతీతుడై ఆతడింతటి జగద్వంద్యమగు మానవసేవచేయుటకు ఆయన నిరంతర ప్రార్థనాశీలతయే కారణము. శ్రీ మహాత్మాగాంధీగారు తమ స్వీయచరిత్రలో ప్రార్థననుగురించి యిట్లు వ్రాశారు.

'స్తుతియు, ఉపాసనయు, ప్రార్థనయు, ఇవి గ్రుడ్డినమ్మకములు కావు, అవి పానభోజనస్థాన గమనములకంటె అధిక సత్యములు.' ఇవియు సత్యములు, మిగిలినవి అసత్యములన్నచో అతిశయోక్తి కాజాలదు.

ఈ ఉపాసన, ఈ ప్రార్థన, వాణీవైభవముకాదు. దీనికి కాణాచి నాలుకకాదు, హృదయము. కావున భక్తిని నించి హృదయమును నిర్మలము చేసికొంటిమేని, మనమా అనంతమున కెగురగలము. ప్రార్థనకు జిహ్వాలో

**బెజవాడ యువతీ ప్రార్థనా సమాజం 26 వ వార్షికోత్సవ అధ్యక్షోపన్యాసము నుండి కొన్ని ముఖ్యమైన భాగములు.**

పనిలేదు. అది స్వభావముచేతనే అద్భుతవస్తువు. వికారరూపములగు మలములను అనగా కామాదులను శుద్ధిచేయుటలో హృదయపూర్వకమైన ఉపాసన ఉత్తమసాధనమని చెప్పుటను నేను సందేహింపను. అయితే ఆ ఉపాసన అతి వినతితో అతి నమ్రతతో పొంది పొసగియుండవలయును.

ప్రార్థనయందు గల మహత్తరశక్తి మహాత్మునకేగాక ప్రార్థనాశీలురకెల్ల యిటులనే అనుభవగతమైయే యున్నది. ప్రార్థన అంటే భగవంతుని వేడుకొంటూ ముక్కుమూసుకొని కూర్చోవడంగాదు. కరచరణాద్యవయవ సంఘటిత కాయము మనకు భగవంతునిచే ప్రసాదింపబడ్డది, నిర్వ్యాపారతచే జడమైపోవడానికి గాదు. ఫలాఫలములయెడ నిర్విచారులై లోకసేవ చేయడమే ప్రార్థనాశీలుర ధర్మం. ఏ మహనీయుని దివ్యసందేశముచే ప్రబోధితమై ఈ ప్రార్థనాసమాజాలేర్పడ్డవో ఆ మహనీయ రాజా రామమోహనరాయలవారి దివ్యజీవితమే యిందుకు తార్కాణం. రాజకీయంగా, సాంఘికంగా, నైతికంగా, ఆధ్యాత్మికంగా ఆయన చేసిన మహత్సేవాఫలితమే మన యీ స్త్రీ సమావేశాదులని చెప్పినను చెప్పవచ్చును. దయార్ద్రహృదయుడగు ఆ మహనీయుడు చేసిన మహత్తరకృషివల్లనేగదా సహగమన దురాచారం మనదేశంలో నిర్మూలమై అసంఖ్య భారత నారీమణులు బలవన్మరణం పాలయ్యే దురదృష్టం తప్పింది. ఈ ప్రాణదాతయొక్క లోకోత్తరమైన సేవతో యేది తుల్యమౌతుంది? సేవలోనే జన్మయొక్క సార్థకత యున్నది. ఉదార బ్రాహ్మమతంయొక్క మూలసూత్రాలైన ఈశ్వరపితృత్వము మానవసౌభ్రాతృత్వము సేవవల్లనే సఫలీకృతం కాగలవు.

ఏపెట్టె తాళం తీయవలెనన్నా, తాళపుచెవి కావలసినట్లుగా ఏపనిచేయవలెనన్నా విద్యకావలెను. మానవులకు విద్యయే దివ్యాలంకారము. 'విద్యావిహీనః పశుః' అను భర్తృహరి సుభాషితం సుప్రసిద్ధమే గదా. మానవులకు జీవితవికాసానికి విద్యయే మూలాధారం. అయితే విద్యయొక్క పరమార్థం జ్ఞానాభివృద్ధిగాని ద్రవ్యార్జనగాదు. విద్య ద్రవ్యసంపాదనమాత్ర ప్రయోజనకరమే అని భావించువారు చదువుకున్నవారైనప్పటికీ వారి అవిద్యాతమస్సు విచ్చలేదనే చెప్పాలె. స్త్రీయొక్క జీవితం సేవాప్రధానమైనది. గృహిణీధర్మమంతా భగవత్సేవ, భర్తృసేవ, శిశుసేవ, అత్తమామల సేవ, బంధుసేవ, అతిథి అభ్యాగతిసేవ, వ్యాధిగ్రస్తుల సేవ, ఆదిగాగల సేవలతో నిండియున్నది. ఏ స్త్రీయొక్క విద్యావికాసం గృహిణులకు నిర్దిష్టమైన యీ సేవాధర్మ నిర్వహణానికి సహాయకరమౌతుందో అదియే స్త్రీల కుచితమైన విద్య అని చెప్పవలె. అంతేగాకుండా వర్తమాన భారతదేశ పరిస్థితులనుబట్టి స్త్రీ సేవారంగము యింతకంటె విశాలమైపోవలసియున్నది. ప్రాచీన భారతదేశము స్వతంత్రపరిపాలనా సౌభాగ్య విరాజితమై ఉన్ననాడు భారత స్త్రీ కార్యక్షేత్రము గృహముమాత్రమే అయిఉండెను. గృహసీమదాటి ఆమె అవతలికిపోవలసిన పని కలుగలేదు. నేటి పరిస్థితులు అట్టివి కావు. నేటికాలపు స్త్రీలకు చదువులేదు. ఆర్థికవసతి లేదు. మతసాంఘికహక్కులు లేవు. పైగా దేశము పరదేశీయపరిపాలనా పీడితమై బానిసత్వం అనుభవిస్తున్నది. ఈ సమయములో స్త్రీలు వంటయింటియందే మనుగడ వెళ్లబోస్తూ ఉండినచో ఈ దేశం యెప్పటికీ అభివృద్ధిచెందజాలదు. జాతినిత్యం, మానవ జీవితం అనిత్యం గనుక, మన జాత్యభ్యుదయంనిమిత్తం మనవంతు సేవాధర్మం మనం నిర్వర్తించాలె. స్త్రీ విశ్వకుటింబినియై గృహంతోబాటు దేశసముద్ధరణానికిగూడా తోడ్పడాలె. 18 కోట్ల భారతమహిళామణులు అజ్ఞానతమస్సులో ఉన్నన్నాళ్లు భారతదేశానికి విముక్తిలేదు; కల్యాణంలేదు.

నీతియుతమైన నడవడి లేకపోతే విద్యనేర్చి ప్రయోజనంలేదు. నీతియుతమైన ప్రవర్తనా, స్వార్థవిరహితమైన ప్రేమా యీ రెండే ముక్తిమార్గాలు. యావత్ప్రపంచం చుట్టివచ్చినప్పటికీ పొగబండి యినుప

పట్టాలనువీసమైనా యెట్లా అతిక్రమించదో, ఆవిధంగానే మానవులుగూడా యే కార్యక్షేత్రాన పనిచేసినా నీతిధర్మాలను సుంతైనా అతిక్రమించగూడదు. పట్టాతప్పితే రైలు యెట్లా బోల్తాపడిపోతుందో నీతిధర్మాలను అతిక్రమించితే మానవజీవితంగూడా అట్లా బోల్తాపడిపోతుంది.

ఐహికమనీ పారమార్థికమనీ విభజనచేసుకొని ఐహికంలో యెట్లాఉంటేనేమి పారమార్థికంగా నడిపితే చాలుననేది కొందరి పంథా. ఇంట్లో కోడలికి అన్నంపెట్టక, నీళ్లుపోయక రాచిరంపాన పెట్టుతూ పైకి భగవద్గీత చేతులతో పట్టుకొని రుద్రాక్షలపేర్లు పెద్దవిధరించి జపంజేస్తూవుండే అత్తగారూ; యింటివద్ద దేవపూజా పితృతర్పణాలు, బ్రాహ్మణ సమారాధనలూ కోలాహలంగా చేస్తూ కచ్చేరీలో నిర్దాక్షిణ్యంగా లంచాలులాగే ఉద్యోగస్థుడూ; ఉదయం సాయంత్రం దేవాలయానికి నిష్టగాపోయి నమస్కారాలుచేస్తూ బడిలో కాపీచేయటానికి ప్రయత్నించే విద్యార్థీ—ఇటువంటివారంతా యీ పంథాలోనివారే. ఇటువంటివారు బాహ్యానికి యెందుకైనా మంచిదని నమస్కారాలు చెల్లిస్తున్నా భగవంతుని సర్వమయత్వము, సర్వాంతర్యామిత్వము వీరికి బోధపడలేదన్నమాట. ఇందువల్ల ఆత్మవంచనా పరవంచనా గాకుండా దైవవంచనగూడా చేస్తున్నారు. తీర్థానికి తీర్థం ప్రసాదానికి ప్రసాదం అనే నడవడి చాలా అనర్థకమైంది. దీనివల్ల యెప్పటికీ ఆత్మోన్నతిలేదు. నిజానికి పారమార్థిక చింతకంటె ఐహికజీవితంలో నిష్ఠగా నడవటమే కష్టమైనపని. ఫలితంగూడా దీనివల్లనే ఉన్నది. పూర్వం జనకాది మహారాజులేమి, ప్రస్తుతం మహాత్ముడు మొదలైన మహానుభావులేమి ఐహికజీవితంలో జూపిన నిష్ఠాపరత్వంవల్లనే కీర్తిశోభితులైనారు.

ప్రస్తుతం మనదేశంలో ముఖ్యంగా మన స్త్రీ సముదాయంలో పారమార్థిక చింత అనేది కపటంతోను డంబంతోను కూడుకున్నదిగా ఉంటున్నది. పుణ్యాపేక్ష చేతనే స్త్రీలీ మాయావాగురులలో జిక్కుకుంటున్నారు. భ్రష్టలౌతున్నారు. గురుశుశ్రూషలు శృంగారరసప్రకరణాలుగాను, భజనతంతులు విలాసక్రీడలుగాను పరిణమిస్తున్నాయి. ఏమితప్పులుచేసినా భగవంతుణ్ణి స్మరిస్తూవుంటే చాలునను దురభిప్రాయం స్త్రీలను తప్పుత్రోవ పట్టిస్తున్నది. ఏ భగవద్గీతాది వేదాంతగ్రంథాలనుజూపి నేడు గురువులు స్త్రీలను వంచిస్తున్నారో, ఆ గ్రంథములలో భక్తిజ్ఞానవైరాగ్య లక్షణాలు అతినీతిబద్ధమైనవిగా చెప్పబడియున్నవి గాని, నటనలతో కాలక్షేపంచేయడమే మంచిపద్ధతని చెప్పలేదు. స్త్రీలావిషయాలను చక్కగా తెలుసుకోకుండ యీ మాయాకలాపంతో మోహితులవడం ఉచితంకాదు.

మన స్త్రీ సంఘం బాగుపడలెనంటే యీ దొంగగురువుల దాడినుండి తప్పుకోవాలె. మహాత్ములమీద భ్రాంతులు పోగొట్టుకోవాలె. ఒకవేళ యే గురువువద్దనైనా నైవేద్యంపెట్టిన పాలువెన్నలు సగానికి సగం తగ్గింపజేసే సత్తా, మట్టిని కుంకుమజేసే సత్తా, ఒళ్లుదులిపితే విభూతిరాల్చే సత్తా, భూమిపైనుండి మూడడుగులు లేచే సత్తా, అరచేతిలో హారతీకర్పూరం వెలిగించే సత్తా ఉన్నప్పటికీ అవి ఒక గారడీవాని ఐంద్రజాలమహిమకంటె యెక్కువదికాదని తెలుసుకోవాలె. భక్తినెపాన, భగవంతునినెపాన మన అమాయక స్త్రీ సంఘంపై కాషాయవస్త్రాలు, బవిరిగడ్డాలు, విభూతిరేఖలు, రుద్రాక్షపేర్లు, నామసప్తాహాలు చేస్తున్న అత్యాచార ప్రక్రియలను వివేకయుతులైన స్త్రీలు యెదుర్కోవాలె. మనకు నూరు ధర్మోపదేశాలుచేసి, తనకు వ్రేళ్ల ఉంగరాలు, తనభార్యకు కంఠహారములు అర్థించే గురువు యేమాత్రపు వేదాంతో విచారించాలె. స్త్రీలు గురువు యొక్క నైతికనిష్టను తెలుసుకోకుండా వానిమాటలచే వంచితులు కాకూడదు. మోక్షం ఆడంబరాలలో లేదు; ముమ్మాటికీ లేదు.

అనేకవిధాలుగా శిథిలమై పునర్నిర్మాణం కోరుతున్న మన భారతదేశానికి మన స్త్రీలు పూనుకుంటేనేగాని సఫలంకాదు. నిర్వ్యాపారంగా ఉండటంగాని స్వార్థలాభంతో తృప్తిపొందడంగాని ఉత్తమ మానవలక్షణం గాదు. మతంలో స్త్రీకి తావులేదు. సాంఘికాల్లో స్త్రీ శృంఖలాబద్ధ. ఆర్థికంగా స్త్రీ నిరుపేద. సారస్వతంగా స్త్రీకి అధమస్థానం. కళాపరిశ్రమల్లో స్త్రీ యేనాడో వెనుకబడిపోయింది. ఇన్నివిధాలుగా స్త్రీ తనకు స్థానం సంపాదించుకోవలెనంటే అన్నివిధాల అఖండకృషి చేయాలె. స్త్రీ లోకంలో అఖండ ప్రబోధం కలిగించాలె. పూజ్యమైన తన జన్మహక్కైన మాతృస్థానాన్ని అన్నిటికీ మాతృక చేసుకోవాలె. ఇదే ప్రస్తుత స్త్రీల కర్తవ్యం.

## • ఆంధ్రీ •

శ్రీకళాకలితమై  అలరారియున్న పూ
లోకవిఖ్యాతమై  ర్వాంధ్ర సౌభాగ్యమ్ము
పునరుద్ధరింపగాఁ బూనుమమ్మా !
నీదు
మనమునను దలపోయ మఱువకమ్మా !!

రుద్రమ్మ నాటియా  మంగమ్మ నాటియా
భద్రపరిపాలనము  సంగరప్రజ్ఞయును
క్షాప్తికిం దెచ్చుకొన సాగుమమ్మా !
ఆంధ్ర
దీప్తికాంతివ్యాప్తి తెల్పుమమ్మా !!

అబలత్వమునుమాని  అస్వతంత్రతతోవి
సబలత్వమునుబూని  ఆంధ్రత్వమును నిల్ప
ధీరపౌరుషములం దేరికొనుమా !
ఆంధ్రి !
వీరనారీమణివి కేగఁగమ్మా !!

—శ్రీ ఎ. మీనాక్షి.

# ★ ప్రతిఫలము

● శ్రీమతి సుభద్రాదేవి

విషాదకరమైన ప్రణయావేగం, అంధమైన అహమిక ఈ కథకు ఇతివృత్తం.

ప్రేమ కాని, కామం కాని దానంతటది ఒక ధర్మంకాబోదు—మనిషి నీతిబద్ధుడు గనకనూ, తన కాంక్షలకి వ్యతిరేకంగా న్యాయమూ, పుణ్యమూ అనే ప్రమాణాలకి కట్టుబడిపోవచ్చు కనుకనూను.

ప్రణయానికి కావలసిన ప్రయోజనాలకీ అతని నైతికాత్మకీ సరిపడకపోతే అతని వ్యక్తి రెండు విరుద్ధభాగాలుగా భేదిల్లుతుంది.

అందగాడైన పరదేశికి అదే సంభవించింది......శ్యామ ప్రేమైకజీవనం మానవజాతి ఉద్దేశంలో పెద్ద తప్పు....

'రాజుగారి ఖజానాలో దొంగతనం! దొంగను తేలేకపోతే నీ తల!' ఆవిధంగా రాజాజ్ఞ పహరావాళ్ల నాయకుడికి వెళ్లింది. రాజాజ్ఞకు భయపడి, పహరావాళ్లు దొంగకోసం ప్రతి వీధీ, ప్రతి ఇల్లూ గాలించారు. పట్టణద్వార మవతల, పాడుపడిపోయిన ఆలయంలో కాశీలో గుర్రాలను అమ్ముకుందామనివచ్చి, తన సర్వస్వం బందిపోటులు కొల్లకొట్టడంచేత, దుఃఖపూరిత హృదయంతో ఇంటికిపోతూన్న తక్షశిల వర్తకుడు వజ్రసేనుని, వాళ్లుచూచారు. అతణ్ణి దొంగకిందకట్టి ఇనుపగొలుసువేసి పహరానాయకుడు జైలువైపు లాక్కొనిపోతున్నాడు.

ఆ సమయంలో అందకత్తె, వేశ్య శ్యామ కిటికీప్రక్కన కూర్చొని క్రిందజరిగే దృశ్యాలనుచూచి ఆనందిస్తూ, కాలం వెళ్లపుచ్చుతూవుంది. హఠాచ్చలనంతో తన పరిచారికను పిలిచి 'ఎంతచక్కనివాడు—దేవతలకు రాజైన ఆ దేవేంద్రుని సహితము ప్రతిఘటింప తగ్గవాడు! అయ్యో! సాధారణ దోషికిలా ఎందుకు సంకెళ్లేశారు? చెలీ, ఆ నాయకునివద్దకెళ్లి నాపేరుమీదుగా తన బందీతో ఈ ప్రదేశాన్ని పావనంచేయమని వేడుకో' అంది.

అందకత్తె శ్యామవద్దనుండి పిలుపురావటంతోనే కాముకుడైన నాయకుని హృదయంలో ఆనందం పరవళ్లుత్రొక్కింది. తక్షణం బందీని వెనకేసుకొని శ్యామదగ్గరకు పరుగెత్తాడు. 'ఎప్పుడూ ఎరుగని ఈ అనుగ్రహం నీ స్తుతిపాఠకునిమీద ఎందుకు కల్గింది? రాజుగారి పనిమీద పోయేందుకు అనుజ్ఞనియ్యి' అని నవ్వుతూ నాయకుడన్నాడు.. శ్యామ 'నా సర్వస్వం తీసుకో. అన్యాయంగా దోషిగా పరిగణింపబడే ఆ నిర్దోషిని వదిలివేయి' అని ప్రాధేయపడింది. 'ఎంతో కష్టమైన కోర్కె—నేను తీర్చకూడదు. రాజు ఉగ్రుడైనాడు. మరి అతనికోపాన్ని ఎవరిరక్తంతోనైన చల్లార్చాలి' అని నాయకుడు సమాధానమిచ్చాడు. శ్యామ అతనిచేతులు పట్టుకుని 'పోనీ, యీ పథికుణ్ణి ఇంకో రెండురాత్రులైనా బ్రతకనీ' అని దీనంగా అడిగింది. 'అంతవరకు తప్పకుండా నా వీలవుతుంది' అని చెప్తూ బందీని తీసికొనిపోయాడు.

రెండవనాటిరాత్రి కాగడా పట్టుకొనివచ్చిన ఓ స్త్రీని లోపల ప్రవేశపెట్టేందుకు, జైలుకొట్టు హఠాత్తుగ తెరువబడింది. ఓమూలని ప్రార్థనాదీక్షలో తన జీవితానికి స్వస్తిచెప్పే ప్రభాతంకోసం ఎదురు

చూస్తూ బరువైన సంకెళ్లలో వజ్రసేనుడున్నాడు. ఆమె కనుసైగ చేయటంతోనే ఫహరావాడు బందీని శృంఖల విముక్తుణ్ణిచేశాడు. ఆశ్చర్యచకితుడైన పరదేశి స్ఫుటిలపద్మంలాగ సుకుమారంగా, కాంతివంతంగా వున్న చక్కని శ్యామ ముఖాన్ని తన కెదురుగుండా చూచాడు. పూర్తిగా చకితుడై, ఎవరు నీవు? చనిపోయే వానికి ప్రాణవాయువులా వచ్చావు. నేనెట్లా తెలిసికోనేది నిన్ను? క్రూరమైన ఈ పట్టణంలో దయా స్వరూపిణిలుకూడా వున్నారా?'

'నేను దయగల్గినదాన్నా!' జైలుఖానానంతనూ భయంతో నింపుతూ వెకిలిగా ఒళ్లుతెలియకుండా నవ్వింది. నవ్వుతూ, ఏడుస్తూ 'ఈ జైలుఖానాలో నాగుండె ఉన్నంతకఠినంగా ఒక్క రాయైనాలేదు' అని ఏడ్చింది. అట్లా అంటూ అతనిచెయ్యి పట్టుకొని జైలు గోడలవతలికి తీసుకొనివచ్చింది.

* * *

వరుణానదీ తీరానికి దూరంగా తూర్పువైపున్న అడవిపైని ప్రభాతం స్ఫుటిలమౌతూంది. ఒక పడవ లంగరువేసి ఉంది. అతణ్ణి పడవమీదికి తీసికొనివెడుతూ 'రా, పరదేశీ! ఒకే ప్రవాహంమీద అడ్డం కులకేమీ లక్ష్యం చేయకుండగ తేలిపోదాము. నా జీవితేశునిగా నిన్ను తీసుకోనీ' అని శ్యామ అతనిచెవిలో ఊదింది. పడవ నడవటం ప్రారంభించింది. నది కిరుప్రక్కలనుండీ పిట్టల ఆనందకూజితాలు వినవస్తున్నై. గుండెకు ఆమె ముఖాన్ని హత్తుకుంటూ 'నీవు చెప్పు, ఎంతమూల్యం ఇచ్చావు నా స్వేచ్ఛ కొనేందుకు? పూర్తిగా వినాలని ఉంది ప్రియతమా! ఈ క్షుభితుడెంతవరకూ ఋణస్థుడో తెలుసుకోవాలని ఉంది' అని వజ్రసేనుడు అడిగాడు. అతని వక్షంలో ఇంకా ఇరుకుతూ 'అది అట్లా ఉండనిద్దూ' అని శ్యామ గునిపింపు మాటలు పలికింది. బలమైన గాలివేగంతో విసురుగాపోయే ప్రవాహంమీద పడవ జోరుగాపోతూంది. మధ్యాహ్నమైంది.

పండినధాన్యపు పరిమళభారంతో వెచ్చ వెచ్చని విసురుగాలి శ్యామ ముఖంమీది ముసుగును తొలగించింది. హఠాత్తుగా, మోహజ్వాల వజ్రసేనుని తనువుపై ప్రాకింది. బొంగురుపోయిన గొంతుతో 'నాకు స్వేచ్ఛ చేకూర్చావు. నన్ను ఎప్పటికీ సేవకునిగా చేయటానికే సుమా. నేను జీవించగల్గుత నీవల్లనే! నా జీవితంలో ఈ నీ ఋణము తీర్చుకోగలనా! నాకు స్వేచ్ఛ ఎట్లాసంపాదించావో మాత్రం చెప్పవూ' అని తడబడే మాటలతో అన్నాడు. తిరిగి ముసుగు సద్దుకుంటూ 'అది అట్లా ఉండనిద్దూ' అని శ్యామ నెమ్మదిగా అంది.

* * *

ప్రశాంతంగా బంగారుఛాయల తెరచాపలు తెరుచుకున్నై. కాంతి నౌక పారమైన పడమటి కొండ క్రిందకు నడుస్తూండగ, ప్రియులనౌకను మలయమారుతం కర్రలతోకట్టిన తీరానికి జేర్చింది. నెల బాలుడు అస్తమిస్తున్నాడు. గ్రుడ్డివెల్తురు నీడలు, మిడతల పాటలతోపాటు కదులుతున్నై. పైరుచువ్వలు జంత్రపు తంతువులులా వణుకుతున్నై.

దక్షిణపుగాలి ఆమె వేడినిట్టూర్పులతో కలిసిపోతూంటే శ్యామ దీర్ఘం ఆశ్వసి తన సహచరుని భుజానికానుకొని కూర్చుంది. ఏదో వింతైన గూడులాగ సువాసనలీనే ఆమె వంకివంకీలకురులు అతని వక్షాన్ని కప్పివేసినై. 'ప్రియా! నీకోసం నేను చేసింది నిజంగా చాలా కష్టమైంది. అది నీకు చెప్పడం అంత కన్నాకష్టమైంది. నేనుచెప్పే రెండుమాటలు నీవు వినటంతోనే ఆ కష్టాన్ని మరపింపచేస్తాయి. నాకో

నమై నా ప్రేమకోసమై ప్రాకులాడుతూన్న నవవయస్కుడు, ఉత్తీయుడు, నన్ను సంతోషపెట్టేందుకు నీశిక్ష ననుభవించాడు. నీగురించి నాజీవితంలో ఎప్పుడూచేయని అధమమైన నేరంచేశాను. అది నా ఉజ్జ్వలమైన ఆనందం' అని శ్యామ బరువుగా చెప్పింది.

జీర్ణించిపోతూన్న చంద్రుడు మాయమయ్యాడు. లెక్కింపరాని పక్షుల నిద్రతోపాటు అడవిలోని చెట్లు మూగవోయి నుంచుని ఉన్నాయి. శ్యామ నడుమును చుట్టుకొన్నచేయి నెమ్మదిగా జారిపోయింది. భరింపరాని ఎడబాటుప్రియుల మధ్య ఆవరించింది. శిలావిగ్రహంలా నిశ్చలంగా వజ్రసేనుడు కూర్చొన్నాడు. శ్యామ అతనికాళ్లమీదపడి విచ్ఛిన్నమైపోయిన లతలాగ, అక్కడే పడిఉంది. నీలిరంగులాఉన్న నది మీద అంధకారం గాఢంగా అల్లుకుంది. హఠాత్తుగా వజ్రసేనుని మోకాళ్లను తనకున్నబలంతో పట్టుకుని 'ప్రియా! నన్ను క్షమించవూ! నేను విధికృతంచేత చేసిన నేరానికి పరమేశ్వరుడు క్రూరమైన ప్రతిఫలం నాకు కల్గ చేయనీ! నీవుమాత్రం నీకోసం చేసినదానికి క్షమించు' అని శ్యామ అశ్రువులురాల్చని పెద్ద ఏడ్పు ఏడ్చింది. తన పాదాలను విదిలించుకుని తీక్షణంగా శ్యామవైపు చూస్తూ 'నా ఈ ప్రాణాన్ని రక్షించవలసిన అవసరం నీకు ఏం కల్గింది? ఎప్పటికీ నా ఊపిరి నీ నేరంతో కొన్నావనే జ్ఞప్తిచేత మలినమవుతుంది. మర్యాదహీనురాలా! నీ అవమానానికి ఋణమైన ఈ జీవితం శాపహతి నొందాలి' అని వజ్రసేనుడంటూ విడిపించుకుని, అడుగడుక్కీ ఎండాకుల్ని కదలిస్తూ ఎంతో చీకటిగాఉండే అటవీ గర్భంలోకి మాయమైపోయాడు. చలనం లేని గాలిమీద మత్తెక్కించే చెట్లఆకుల పరిమళం ప్రేళ్లాడుతూంది. ఆవరించిన విషాదంలో లెక్కలేని కొమ్మలు పెద్దవిగా భయంకరరూపాలు దాల్చాయి. ఆ దట్టమైన వనలతా శృంఖలాలు త్యజించిన మోస్తరుగ చేతులను చాచుకొని ఉన్నాయి. అలసిపోయిన బాటసారి బడలికతో నేలమీదికి ఒరిగాడు.

నీడలాగ ఒకపిశాచరూపం అతని దగ్గరగానుంచుంది. నెమ్మదిగా చీకట్లో దీర్ఘమైన కష్టమిచ్చే దారిలో అతని అడుగుల్లో ప్రేళ్లాడుతూందామె. ఆమె కోమలపాదాలు రక్తసిక్తమైనై. గుప్పిళ్లువిసురుతూ 'నన్ను వక్కణ్ణీ ఉండనీయవా?' అని కోపంగా గర్జించాడు. తన కౌగిలింతలతోటి, జారిపోతూన్న కుంతలాలతోటి, తన త్వరితచుంబనాలతోటి, వేడి నిట్టూర్పులతోటి ఒక ప్రవాహంలాగ విరుచుకుపడి అతని శరీరాన్ని ముంచి, ఆమె అతన్ని మెరుపుకన్న వేగంతో పట్టుకుంది. ఆవేశంలో మాటరాక 'ఎప్పుడూ నిన్ను వదలలేను. ఎందుచేతనంటే నేను పాపంచేశాను. మరి నీ దగ్గిరనుంచే నా అంతిమ ప్రతిఫలమో, దండనో పొందాలి' అని ఆయాసంగా ఉచ్చరించ కల్గింది.

జరుగబోయే ఘోరకృత్యం సూచిస్తూ గ్రుడ్డివెన్నెలైనాలేని విషాదావరణంలోఉన్న చెట్లను మూగ చేసిన ఆ అంధ పూర్వస్మృతి ఏమిటి! ఆమె కంఠం నొక్కేముందు అంతిమ విషాదవిజ్ఞానం బరువైన చప్పుడుతో ఒక ఆకృతి నేలమీద దొర్లింది.

ఉదయారుణకాంతి తళుకులతో పుణ్యగంగఒడ్డునవున్న దేవాలయ గోపురంమీది త్రిశూలాన్ని మలాముచేస్తూంటే వజ్రసేనుడు అడవినుండి తిరిగి వెనక్కిదారిపట్టాడు. గాజుపారిన పిచ్చికళ్లతో ఆరోజంతా ఏ లక్ష్యంలేకుండా తిరిగాడు. మధ్యాహ్నం సూర్యుడు తన మంటకొరడాతో ఈచంపా ఆచంపా వాయించాడు. దాహంచేత అతని గొంతుక ఎండిపోయింది. కాని దగ్గరఉన్న నదిలోని ఒక నీటిబొట్టైనా ముట్టలేదు. జ్వరంచేత దహించుకుపోతూన్న శరీరంతో మునిమాపువేళ ప్రియులు లంగరువేసి, వదలివేసిన

కడవదగ్గరకు మంటవైపు చిమ్మట ఎట్లా పరుగెడుతుందో అట్లాగ వజ్రసేనుడు పరుగెత్తాడు. అతని దృష్టికి ఒకకడియం కనుపించింది. తనగుండెకు హత్తుకున్నాడు. దాని మువ్వలచప్పుడు శతశరాలు కోసినట్లు అనిపించింది. ఒకవైపున ఆమె నీలివర్ణపుదుస్తులు ప్రోగుగా పడివున్నై. ఆమె సున్నిత అవయవాల నిలిచివున్న సువాసనను తీరని ఆతురతతో ఆఘ్రాణిస్తూ తనముఖాన్ని దుస్తులముడతలలో దాచుకున్నాడు.

ఇసుకతిన్నెపైని ఒక నీడ చెట్లమధ్య పిశాచంలాగ కనుపించింది. 'నా దగ్గరకు వచ్చేయ్, నా ప్రేమమయీ!' అని వజ్రసేను డేడ్చాడు.

'ఇక్కడున్నా, నాప్రభూ!' అని అంటూ శ్యామ అతనిపాదాలమీద వ్రాలింది. 'క్షమించు నన్ను. అయ్యో! నీ జాలిచూపే హస్తాలు నా బరువైన ఊపిరిని ఆర్పివేయలేకుండగ ఉన్నాయి' వజ్రసేనుడు ఆమెముఖం కేసి వెఱ్ఱిగా చూడడం మొదలెట్టాడు. సాష్టాంగా కృతిలోవున్న ఆమెను తన చేతులలోకి పోగునా ఎత్తుకుందామనుకున్నాడు. కాని పులకరంవచ్చి అతన్ని సమాధ్యవస్థనుండి లేపివేసింది. అవతలికి తోసేస్తూ 'మళ్లాఎందుకు తిరిగి వచ్చావు?' అని గర్జించాడు. కడియాన్ని అవతలికివిసిరేశాడు. రగుల్తూన్న, నిప్పులాగున్న ఆ నీలిదుస్తుల్ని తన్నాడు. తనరెండు కళ్లనీ మూసుకుని, మరొకవైపు ముఖంత్రిప్పి 'పో! పో! నన్నొక్కణ్ణీ వదిలేయి' అని కేకవేశాడు. శ్యామ అవనతవదనయై కొంచెంసేపు అక్కడనే నుంచుంది. తర్వాతవంగి, తనమునివేళ్లని క్రిందకు ఆజ్ఞా బద్ధురాలుగా దించింది. నదివడ్డు దిగిపోతూ, విపినాంధకారంలోకి నడిచిపోయింది. ఐహిక లోకానికి పనికిరాక ఒకరి ప్రశాంతతను కొంచెంసేపు కలవరపరచే స్వప్నంమాదిరి, ఆమె గభీరరజని ఆలింగనంలో మాయమైపోయింది...

(రవీంద్రుని ఆంగ్లకథకు అనువాదం)

# విరహిణి

చూపులే తూపులై
చూరగొన్నవి మనసు
తడబడుచు నీదరికి
తరలివచ్చితి గాదె!

హేమంత నిశివోలె
నెమ్మికున్నది యెడద
చరణస్పర్శా శ్లేష
మైన కరుణింపుమా!

మనికి మరిపించేటి
మధుర భాషణముతో
పలుకరించుట కైన
ప్రాణేశ; తగనా!

ఏకతమ కూరుచుని
'ఏకతార' ను మీట
పూర్వాను భవమేలో
కెక్కరించు నెడంద

ఆకాశ మొకతీరు
మొయిలుపహరాయ లాందగనె
చెమ్మి నెమ్మనముతో
నీకొరకె పలవింతు.

నీపాద పూజకై
నే పూవులనుకోయ
నీ మధురమూర్తియే
నిత్య సన్నిధానమే!

గాలిలో కదలాడు
గానమాధురి గ్రోలి
నీ జాడలరయనే
నిటునటుల పరువెడుదు!

నీనామ మననమున
నీభాష నేర్చితిని
నీప్రేమ వరముచే
నీకరమె కోరితిని!

—శ్రీమతి
జ. సుభద్రాదేవి



# సన్‌లైట్ సబ్బును వాడుటకు ఆరంభించి నప్పటినుండి నీషర్టు చాల ఎక్కువ తెల్లగ నుంటున్నది.

సన్‌లైట్ సోపును వాడుటకు ఆరంభించినందున నాకు చాల సంతోషము. సాధారణమైన బీడు సోపుల వెల తక్కువగా ఉండవచ్చును కాని అవి నా పైకమును నిలువపెట్టుటకు తోడ్పడవు. ఎందుకనిన సన్‌లైట్ సోపు ఇచ్చునట్లు మిగిలిన సోపులు అంత శుభ్రపఱచు నురుగు నిచ్చుట లేదు. నురుగే గుడ్డలను శుభ్రపఱచునట్టిది. సన్‌లైట్ సోపు మంచి గుణముగల ఈ నురుగును ఎక్కువగ ఇచ్చుటచే పైకము ఎక్కువ సెలవగుట లేదు. ఒక్కొక్కరు మన దుస్తులన్నియు చాల శుభ్రముగాను, క్రొత్తవిగాను ఉన్నవని చెప్పెదరు.
మఱియు, సన్‌లైట్ వస్త్రములకు ఇంపైన వాసనను ఇచ్చుచున్నది.

## సరియైన సన్‌లైట్ సోపు ఇట్టి అట్ట పెట్టెలలో అమ్మబడును.




S. 17-50 TL

LEVER BROTHERS (INDIA) LIMITED

# ★ సర్వోదయము – సామ్యవాదము ★


– శ్రీమతి –

వల్లభనేని రంగాదేవి


> విశ్వమానవ కల్యాణానికి 'అహింస' ఆచరణీయమంటాడు...ఉజ్వలమైన రాజకీయ, నైతికజీవనానికి దీన్ని ప్రాతిపదికను చేశాడు...దీనివల్ల 'సర్వోదయం' సిద్ధిస్తుందంటాడు—గాంధిజీ.
> అయితే దీని అంతరార్థం ఏమిటి?

మానవసంఘములో వ్యాపించియున్న అశాంతిని, హాహాకారాన్నీ రూపుమాపాలంటే రెండే ఉపాయాలు; ఒకటి సామ్యవాదము, రెండు సర్వోదయము. సామ్యవాదమనగా కమ్యూనిజమునకు వైజ్ఞానికముగాను, శాస్త్రీయముగాను రూపమిచ్చినది కాల్ మార్క్స్. దాని యాదర్శము వర్గరహిత సంఘస్థాపన. - సర్వోదయశబ్దముయొక్క జన్మదాత, దాని ప్రచారకుడూ మన ముసలితాత గాంధిమహాత్ముడు. సర్వమానవోన్నతి, సర్వమానవ సమత్వము దీని ఆదర్శము. వర్గరహిత సంఘకల్పన మూలమందు సమతావాద సిద్ధాంతము పనిచేయుచున్నది. ఒకరికొకరు కష్టములు సమకూర్చుకొనుట, యొకరినొకరు కష్టపెట్టుట, యొకరి వున్నతిజూచి మరొకరు యోర్వలేకుండుట మొదలగు భావాలు సంఘములో ఉండకూడదు. పైపెచ్చు మానవులంతా ఒకేవర్గమునందుండాలి. అదే మానవజాతియై వెలయాలి. సంపదలందు వ్యక్తిగత యధికారముండగనే పరస్పర ద్వేషాలు, పాలితపాలక యభిప్రాయాలు జనించి పెరుగుతాయి. కాబట్టి సంఘములోనుండి, సంపదమీదనుండి, అనగా యుత్పత్తిసాధనాలమీదనుండి వ్యక్తిగత యధికారము తొలగించాలి, అనునదే సామ్యవాదముయొక్క ముఖ్యసిద్ధాంతము. అట్టి సంఘమెటుల నిర్మితమౌతుంది? దీనికి సమాధానమేమి చెపుతారంటే, మొట్టమొదట యేవిధంగానైనా రాజనైతిక యధికారం సంపాదించాలి. శ్రామిక నియంతృత్వం యేర్పరచి, పిమ్మట దానిబలంతో ఆదర్శసంఘాన్ని యేర్పరచాలి. రాజనైతిక అధికారం పొందుటకు, మనకు హింసాత్మక బలంతప్ప వేరేవుపాయం లేదు; గత్యంతరమూ లేదు. అని సామ్యవాదులంటారు.

సర్వోదయ ఆదర్శముకూడా యిదే. సంఘములో దౌర్జన్యం, అశాంతీ ఉండకూడదనే కాని దాని విధులలో భేదమున్నది. మహాత్ముని దృఢాభిప్రాయంకూడా యేవిధమైన అశాంతినీ సంఘములో వుంచకూడదనేదే. కాని, మన వ్యక్తిగత సాంఘికజీవితంలో అహింసకు సర్వప్రథమ సర్వోచ్చస్థానం యివ్వాలి అని. హింస అంటే యితరులను అణచి, వారిని యేపనియైనా చేయుటకు బలాత్కరించుట మొదలగు కృత్యములు. అహింస అంటే యితరుల ఆత్మలను తన సత్ప్రవర్తనవల్లనూ, సద్భావముతోనూ, ప్రేమతోనూ సందర్భానుసారంగా, స్వయంగా కష్టాలు సహించియైనా జయించి, తన కనుకూలంగా చేసుకొనుట. యేదో యొక హింసాశ్రయములేకుండా యెవరూ యెవరినీ పీడించజాలరు. పీడించడం అంటే న్యాయంగా, ధర్మంగా యొకవస్తువును పొందుటకు అధికారం లేనప్పటికీ దానిని మాయ, మోసం, తెలివి మొదలగు జిత్తులద్వారా తన యధికారము క్రిందకు లాగుకొనుటే. నిజంగా, న్యాయంగా, సత్ప్రవర్తన

ఖాదే వుంటే యేవస్తువు మనకు దక్కదో అందుకు కొంచెము దుశ్శీలముతోనూ, గుప్తంగానూ, అప్రత్యక్ష మార్గావలంబనముతోనూ సంచరించాల్సి వస్తున్నది. దీనినే పీడించడం అంటారు. యిందులోనే హింస నిబిడీకృతమై యున్నది. ఇందువల్లనే గాంధిజీ యేమంటాడంటే, 'పీడించుట అనేదాన్ని నాశనముజేసేముందు, హింస అనుదాన్ని రూపుమాపండి. అంటే యేరూపములోనైనా సరే, సూక్ష్మరూపంలో కానీయండి, స్థూలరూపములో కానీయండి, హింసకుమాత్రం ఆశ్రయమివ్వకుడు' అంటాడు. గాంధిజీ యీ వుద్దేశ్యం బాగుంది. సామ్యవాదువలె ఆదర్శ సంఘరచనకుముందు, రాజనైతికబలం అవుసరం అనేదికూడా అక్కర్లేదు; రాజనైతిక బలమందునుకూడా హింసవుంటుంది గనుక. పైగా రాజనైతిక ఒత్తడిలేకుండా, యే కార్యము సాఫల్యమగునో అదిచాలా శుద్ధముగాను, యెక్కువ కాలము మన్నేదిగాను అయివుంటుంది. దాని రాజనైతిక యాదర్శం రామరాజ్యం. అంటే అంతా మంచిదనుకొనేది. అది పైనుండి అదమాయించే నియంతృత్వమును యిచ్చగించదు. దానివల్ల మానవస్వతంత్ర వికాసంకలుగదు.

సామ్యవాదులు జెప్పేదేమంటే ముందు సంఘటితహింసద్వారా, రాజనైతిక అధికారం సంపాదించి, తదుపరి దానిద్వారా సంఘములో హింసావృత్తి అనేదాన్ని రూపుమాపాలి అని. ఆలోచించి చూస్తే, హింసాబలముతో సురక్షితముగనున్న రాజ్యమును స్వాధీనం చేసుకోవాలంటే, అంతకన్నా రెట్టింపు హింసాబలమును సంపాదించాలి; స్థిరపరచాలి. అదీగాక, యిరుగు పొరుగు రాష్ట్రాలు ఆక్రమించుకోనకుండా కాపాడుకోవడానికి ఆస్థిరపడ్డ హింసాబలమునుపోషించాలి; ఖాయపరచాలి. అహింసద్వారా రాష్ట్రోద్ధరణ జరిగినప్పటికీ, విశ్వాసంలేకపోతే మాత్రం మనంకూడా హింసాబలమును విడనాడజాలము. యిరుగు పొరుగు దేశాల్లో విశ్వాసం సంపాదించలేము. తత్ఫలితముగా దీర్ఘకాలపర్యంతము హింసాబలాశ్రయమునుండి విముక్తి పొందజాలము.

హింస అహింసకన్నా శ్రేష్టమైనట్టిన్నీ, హింస అహింసకన్నా నైతికంగా యోగ్యమైనదనిన్నీ, అందరకూ తెలుసును. కాని హింసాబలముతో నేడు నెరవేరుచున్నపనులన్నీ అహింసద్వారా నెరవేరుతవా? అహింస హింసకన్నా కార్యానుకూలమైనదా? వ్యవహారయోగ్యమైనదా? అన్న సందేహం కలుగుచున్నది. దీనికి మహాత్ముని జవాబేమంటే 'కాకున్నప్పటికీ హింస పనికిరాదు'. అంటే_అహింసావలంబనలోనే పనులు నెరవేరతవి, అత్యల్పకాలములోనూ, మరింతబాగుగాను. అయినప్పటికీ హింసాబలముతో నెరవేరుతున్నంతవేగంగా, అహింసాబలముతో నెరవేరుతున్నట్లు కాన్పించవు. కాని ఒకపర్యాయము అహింసా విజయము ప్రారంభమైనదంటే, సత్ప్రవర్తనతో అహింసాపథమున నడచినంతకాలము పరాజయమనేది కాన్పించదు అని ఆయనవిశ్వాసం. కాని యిది నిజం. అహింసాత్మకమైన సంగ్రామవిధానం యిప్పుడే వ్యాపించక పోవుటచేతను యేండ్లతరబడీ అభ్యాసమందున్న హింసాత్మకయుద్ధం శాస్త్రంగా తయారైవున్నది. క్రమేపి, మనం అహింసాత్మక బలప్రయోగం అభ్యాసంచేస్తూవుంటే దాని శాస్త్రంకూడా దానంతటదే తయారవుతుంది. మనం దీనిమీద ఆలోచించినకొద్దీ, అవగాహనచేసుకున్నకొద్దీ, దివ్యభవిష్యకాంతులు దృగ్గోచరమవుతవి. మనబుద్ధి నిజంగా అహింసా శ్రేష్ఠత్వమును గ్రహించిననాడు, అందు నిత్యనూతన ఆశ్చర్యానుభవములుగాక మానవు. అనుభవములోనికివచ్చిన కొద్దీ దృఢత్వమేర్పడుతుంది. అహింసా సాధన కదంతొక్కితే వచ్చేదికాదు. చిత్తవృత్తిని నిర్మలంగానూ, నిస్స్వార్థంగానూ, నిరభిమానంగాను, రాగద్వేష రహితంగానూ వుంచాలి. యిందులోనే అమోఘమైనబల ముత్పన్నమవుతుంది. దాని ప్రయోగపథమున గూడా ప్రకాశం జ్వాలాయమానంగా వుంటుంది. మహాత్ముడు యేపుస్తకమూచదివి మనకు అహింసా యుద్ధ పద్ధతులు నేర్పుటలేదు. ఆయనచిత్తమును అహింసామయముగ జేసుకున్నాడు. ఇందువల్ల ఆయనకామార్గము తొందరగా దృష్టిగోచరమగుచున్నది. ఘనముకూడా అహింసావలంబులమై యితరులకు చోరవనిస్తూన్నప్పుడు గాంధీయులమైపోదుము. అప్పుడే, ఆనాడే, అహింసాశాస్త్రము నిర్మాణమగును.

హింసాత్మక, అహింసాత్మక బలాలపై ఆధారపడ్డ మానవుల ప్రతిష్టల్లో పెద్దభేదమొకటి కాన్పిస్తున్నది. ఒకనికి మానవప్రకృతికి మూలకందమైన సత్ప్రవృత్తిమీద విశ్వాసంవుంటే, రెండవవానికి అవిశ్వాసము. విశ్వాసమున్నట్టివ్యక్తి నిరాశాసమయాల్లోకూడా హృదయస్థమైన దానిమీదనే యాధారపడి తన కర్తవ్యపథమును దప్పకపోవును. యెదటివాని హృదయము మారినట్టుల చివరకుగాంచును. యిప్పుడతను శత్రువుగాడు; మిత్రుడగును. యెందుచేతనంటే వాని పోట్లాట, వ్యక్తితోగాక అతని అవగుణాలతోనూ, దుష్ప్రవృత్తులతోనూ గనుక. కాబట్టి అతను ఆమూలాగ్రంగా వ్యక్తియొక్క నాశనంకోరడు. అలావ్యక్తియొక్క గుణాలను, శక్తులనుకూడా నాశనం చేయడమంటే సంఘాన్ని ద్రోహము చేయడమున్నూ, క్రూరంగా హింసించుటాను. దీనికి వ్యతిరేకంగా మానవుడు ముఖ్యంగా 'స్వార్థి' అని అనుకుంటే అహింసామహాత్మ్యమును యెలాగు గ్రహిస్తాడు? దాని వుపయోగానుభవములు యెలా పొందగలుగుతాడు? కమ్యూనిష్టుల, గాంధీవాదుల విశ్వాసాల్లోయున్న అంతరమిదియే. గాంధివాది మానవప్రకృతికి మూలకందమైన సత్ప్రవర్తనను నమ్ముతాడు. కమ్యూనిష్టుల అనుభవాలకూ, అవలోకనలకూ, హద్దు, పరిమితి, అనేదివుంటే గాంధీవాదము యొక్క మూలమునందున్న యాధ్యాత్మికతత్వమూ, వేలకొలదీ వత్సరములనుండి క్రియారూపంగా జరుగుచూ వచ్చిన ఫలితమూ, నిండువిశ్వాసమూ, పూర్వాపరజ్ఞానమూ, వాళ్లకే గోచరమవుతుంది.

అహింసా విజయాధారం చిత్తవృత్తిలోవుంది. హింసావిజయాధారం శరీరంమీదవుంది. చిత్తశక్తియొక్క సామ్రాజ్యంలో ప్రవేశించిపోతూన్నకొద్దీ అహింసా చమత్కారాలు, బలాలు, అనుభవములోనికి వస్తవి. కాని ఆచిత్తాన్ని మనమెరసి సరియైన మార్గమున బెట్టాలి.

మొట్టమొదట అహింసాతత్వాన్ని ప్రపంచమందు క్రియారూపమున బెట్టగల్గినది గాంధిమహాత్ముడు. దానిలో యఖండవిజయంపొంది ప్రపంచమందు ఆంతరంగిక బాహ్యపోరాటాలను రూపుమాపుటకు హింసకు తీసిపోదని ఋజువుపరచినది కూడా మహాత్ముడే.

కమ్యూనిష్టుల, సోషలిష్టుల, ఆత్మల్లోగనుక అహింసాతత్వముయొక్క విరోధరాహిత్య సిద్ధాంతము పడితే 'సర్వోదయము—సామ్యవాదము' అను విభేదము ఎవరి మనస్సుల్లోనూ ఉత్పన్నముకాదు. పైగా 'సామ్యవాదము' అను పదమునకు బదులు 'సర్వోదయము' అను పదమే సార్థకమవుతుంది; భావాత్మకంగా కూడా వుంటుంది.

## విభీషణప్రబోధము

గీ. పుడమిఁగల జీవులను గడగడవడంకఁ జేయఁజాలుదు ననియింతఁ జేసితీవు
రాముఁడు నరుఁడటంచు నిరాకరింపఁ బూనితి భగవదంశ సంభూతుఁడతఁడు.

క. సురలును విద్యాధర కిన్నరులును మునిపుంగవులును నరులుఙ్ బొగడఙ్
హరి దశరథసూనుండై దురితాత్ములఁ జంపఁబుట్టె దోర్బలయుతుఁడై.

గీ. ఇలనుగల క్షత్రియులను ముయ్యేడుమార్లు వెదకిచంపిన యట్టి యా విప్రవరుని
నధిక తేజునిఁ బరశురామావతారు భంగపఱచెను రాముఁడవ్వార్త వినవో?

గీ. పరసతినిఁ దల్లిగాఁజూచి వరలవలయు ప్రజల బిడ్డలవోలెఁ గాపాడవలయు
బుధుల దర్శించినపుడు శేల్మొద్పవలయు సకల సౌఖ్యంబులందె భూజానికబ్బు.

గీ. కానసీతను భూజాతఁగమలనేత్ర రాఘవునికొసఁగి యతనిప్రాపుఁగనుము
హితముసెప్పఁగ నాకేతఁడెంత యనుచు నలుగవలదేను నీమేలు నభిలషింతు.

—శ్రీ గంథం నరసింహాచార్యులు



| | | |
|---|---|---|
| ప్రభల | వల్లూరి | దేవరకొండ |
| సుందరీబాయి | శ్యామలాదేవి | సీతాబాయి |

బొంబాయి ఆంధ్రమహాసభ మహిళాశాఖా సభ్యురాండ్రు.

8-వ వార్షికోత్సవ సందర్భమున ఆటలపోటీలు జయప్రదముగా జరిగినవి. కేరమ్సు సింగిల్సులో ప్రథమ బహుమతి శ్రీమతి ప్రభల సుందరీబాయి గారికిని, ద్వితీయ బహుమతి వల్లూరి శ్యామలాదేవి గారికిని యొసంగబడినవి. షటుల్ కాక్ సింగిల్సులో శ్రీమతి వల్లూరి శ్యామలాదేవిగారికిని ద్వితీయ బహుమతి శ్రీమతి దేవరకొండ సీతాబాయి గార్లకు నొసంగబడెను.

## కాకినాడ స్త్రీ విద్యార్థినీ సమాజముయొక్క 26-వ వార్షికోత్సవము



సమాజ కార్యదర్శిని శ్రీమతి వేమగంటి పాపాయమ్మగారు, సమావేశమునకు అధ్యక్షతవహించిన శ్రీమతి మల్లిపూడి లీలావతీ చెల్లయాంబగారు (తూర్పుగోదావరి జిల్లాబోర్డు అధ్యక్షులు శ్రీ మల్లిపూడి పళ్లంరాజుగారి సతీమణి) ప్రథమ వస్తుప్రదర్శన ప్రారంభోత్సవమును జరిపిన శ్రీమతి వేదాంతం కమలాదేవిగారును వరుసగా మధ్యను కూర్చొనియున్నారు.

# శుచి

(ఏకాంకిక)





– శ్రీమతి –
అవధానం సీతాలక్ష్మి

క్రీ. పూ. మూడవ శతాబ్దం.

శ్రావస్తిక సమీపంలో ఒక పెద్ద అడవి; బోధి వృక్షచ్ఛాయల్లో పచ్చిక బయలు; సంజకెంజాయలో రత్నకంబళంవలె ముద్దులుకురుస్తూంది; పచ్చగా లేతము త్తైదువువలె ప్రకృతి కళకళలాడుతూంది; ఆకాశంలో అక్కడక్కడ మేఘాలు దట్టంగా క్రమ్ముకొన్నవి; అంతా ప్రశాంతం.

పద్మాసనం వేసికొని, కృష్ణాజినంపైన కూర్చుంది భిక్కుని శుచి; ఎడమచేతిప్రక్క ఒక కమండలం; కుడిచేతిప్రక్క ఒక యోగదండం; కాళ్లదగ్గరే ఒక సెలయేరు పారుతూంది; పంచమస్వరంతో కోయిల మంగళారతి పాడుతూంది.

భిక్కు గౌరాంగుడు ఒక కర్ణికారం కోసి ముద్దుపెట్టుకున్నాడు; సంతోషం పట్టలేక ఊమ్మకు కౌగిలించుకున్నాడు.

[సూర్యుడస్తమిస్తూన్నాడు]

గౌరాంగుడు (ఉన్నట్లుండి):-శుచీ! అదిగో! చూడు! అంతా మాసిపోయింది! అయ్యో! ఇంక కనబడదూ?

(శుచి ధ్యానంలోవుంది. గౌరాంగుడు ఆమెదగ్గరకు పరుగెత్తుతాడు)

శుచీ! చీకటి! అబ్బా! చిమ్మచీకటి! గ్రుడ్డివాణ్ణే! చూడు! అంతాపోయింది!

(కళ్లు తెరిచింది; ముసిముసినవ్వులతో అస్తమించే సూర్యుణ్ణి చూచింది శుచి)

గురుదేవా! సాష్టాంగములు!

గౌరాంగుడు:-శుచీ!

శుచి:-ఔను. బుద్ధభగవానుని చూచినట్లే వుందికదూ?

[సూర్యునికి నమస్కరిస్తుంది.]

గౌరాంగుడు:-చచ్చిపోతూన్నాడు పాపం! వాణ్ణి చూస్తే నాకు జాలి కలుగుతూంది. శుచీ! వృద్ధిక్షయాలు ఒక్క మానవునికే అనుకున్నాను.

శుచి (ఆకాశంవైపు చూస్తూ):-అక్కడ చూడు! ఎంత భీభత్సంగా వుందో!

[ఉరుము వినబడుతుంది.]

గౌరాంగుడు:-అంత పిఱికివాణ్ణి కాదులే!

శుచి:-అంటే?

గౌరాంగుడు:-అయ్యో! జగజ్జ్యోతి ఆరిపోతూందే!

శుచి:-హుం! పిఱికివానివి కాదుకదూ? మఱి ఎందు కాకన్నీరు! ప్రొద్దు క్రుంకుతూందనేనా?

గౌరాంగుడు:-ఎప్పుడూ పగలే కావాలి! ఎంత ప్రకాశం! ఎంత సుందరం! ఆహా! స్వర్గమే!

శుచి:-అడుగుతప్పిన నృత్యాన్ని ఎవరు చూస్తారు?

గౌరాంగుడు:-ఆఁ! అయితే ఇది నాట్యభంగిమ మేనా?

శుచి:-కాక? ప్రకృతితాండవం.

గౌరాంగుడు:-అయ్యో! కాదు శుచీ! ప్రళయతాండవం! చూడు! పద్మిని ఎంతగాఏడుస్తూందో! వాడివాడి వరుగైపోయిందే!

శుచి:-అక్కడ! కలువ వెన్నెల చల్లుతూందే! కనబడలేదూ?

గౌరాంగుడు:-సూర్యుడు లేకుంటే నేను బ్రదుకనే లేను!

శుచి:-మునిమాపు కమ్మ వెలుగు లేదూ?

గౌరాంగుడు:-అదంటే నాకు అసహ్యం.

శుచి:-ఎందుకూ?

గౌరాంగుడు:-భగ్నజీవి వికృతాట్టహాసంవలె వుంది!

శుచి:-అలా అనకు. దాని సౌందర్యం దానిది. ఎప్పుడూ సూర్యుడే వుంటే విసుగనిపించదూ? జీవితమంతా ఒక్కటే వెన్నెలరేయి అయితే, ఆ మనుష్యునికి చిత్రవధ అన్నమాటే! సృష్టిలోని ప్రతివస్తువునూ నిష్పాక్షికంగా ప్రేమించాలి.

గౌరాంగుడు:-ఏమిటో!

శుచి:-సమదృష్టి లేకుంటే కళ్లు పురుగుపట్టిపోతవి. కాస్త కళ్లు తెరు.

గౌరాంగుడు:-నన్ను ప్రేమించవూ?

శుచి:-అన్నా! నీవు నా బహిఃప్రాణం.

గౌరాంగుడు:-'అ-న్నా'—(అదరిపడ్డాడు; ఊరకే బాధపడుతున్నాడు) శుచీ! నన్ను అలా ఎప్పుడూ పిలువకు.

శుచి:-ఏమి?

గౌరాంగుడు:-మనము అన్నా చెల్లెలు కాలేము.

శుచి:-ఏమిటీ!

గౌరాంగుడు:-ఏమిటో చెప్పలేను. కాని సత్య మెక్కడ పోతుంది?

శుచి (తనలో):-పాపం! బలహీనుడు! ఆ ప్రళయ సంక్షోభం భరించలేడు.

[పిడుగుపడుతుంది; ఆకాశమంతా ఊగిపోయినట్లుంటుంది.]

గౌరాంగుడు:-శుచీ!

శుచి:-అన్నా! శుచి ఎప్పటికీ నీ చెల్లెలే!

గౌరాంగుడు:-ఊఁహు. కానేకాదు.

శుచి:-ఏమీ?

గౌరాంగుడు:-నేనుమాత్రం అలా పిలవను.

శుచి:-ఎందుకన్నా?

గౌరాంగుడు:-శుచీ! హృదయానికి కళ్లున్నవి.

శుచి:-ఎక్కడ?

గౌరాంగుడు:-మాటలే!

శుచి:-అన్నా! నన్ను చెల్లీ అని పిలువవూ? నాకంత అదృష్టంలేదూ! అంత అర్హతలేదూ!

గౌరాంగుడు:-ఏమిటో నాకే తెలియదు. నా హృదయాన్నడుగు, చెప్పతుంది.

శుచి:-చెప్పవూ?

గౌరాంగుడు:-ఊఁహు.

శుచి:-సరేకదూ?

గౌరాంగుడు:-అబ్బా! నాబాధ నీకప్పుడే అర్థమైంది! నన్నూరకే అలయింపకు శుచీ!

శుచి:-అన్నా! నిజంచెప్పు. చెప్పేదంతా నీవు చేస్తూనే వున్నావా?

గౌరాంగుడు:-అనుకుంటా.

శుచి:-మరి ఇప్పుడు నన్ను విలువునా కోసివేస్తూ న్నావే! అహింసాధర్మంపైన ఎన్ని గంభీరోప న్యాసములిచ్చావో జ్ఞాపకముందా?

గౌరాంగుడు:-శుచీ! నేను బ్రహ్మరాక్షసుడను కానే?

శుచి:-అబ్బే! ఎవరన్నారు? శుచీదేవి సోదరుడు రాక్షసుడెలా అవుతాడు? స్వర్గాన్నే సంస్క రింపగల మహాత్ముడే! (ఆదుర్దాగా) అన్నా! ఎందుకూ? ఏమి చెప్పవూ?

గౌరాంగుడు:-'అన్నా'! అబ్బా! శుచీ! వినలేనే! ఎవరు నీ అన్న? అయ్యో! నీ ప్రేమమూర్తిని 'అన్నా' అని పిలుస్తావే! (వాడిపోయిన ఒక చంపకం తీసికొంటాడు.) శుచీ! ఏదీ! ఒక్క సారి నవ్వు. ఇది కళ్ళు తెరుస్తుంది, హృదయం అంకితమిస్తుంది.

శుచి:-ఎవరికి?

గౌరాంగుడు:-నీకు! తనకు నూత్నయౌవనం ప్రసా దించిన తేజశ్శక్తికి!

శుచి:-అన్నా! ఎంత వెర్రివాడివి!

గౌరాంగుడు:-అనురాగపూత మైన నీ అపాంగావలో కనంకోసం ఏండ్లకొద్దీ తపిస్తూన్నాను.

శుచి:-తాపమే!

గౌరాంగుడు:-కాదు, తపస్సు. శుచీ! నీ దాసుణ్ణి. దగ్గరతీయవూ? అబ్బా! నీ హృదయం వజ్రమే! శుచీ! శుచీ!!

(ఆమె కాళ్లు పట్టుకోపోతాడు; తక్షణం ఆమె అతన్ని లేవనెత్తుతుంది.)

శుచి:-విచ్చీ విచ్చని ముగ్ధపుష్పాన్ని ఎప్పుడయినా చూచినావా?

గౌరాంగుడు:-ఒక్కసారికాదు. గాలికివిగిరే-కుచ్చెళ్లు సవరించుకోకుండా, వచ్చీరాని నగ్నగీతికలతో, భాగీరథీ తీరంలో నళిని అళికుమారునితో దాగుడుమూతలాడుతుంది. ఎన్నోసార్లు చూచాను.

శుచి:-అప్పుడు నీమనస్సు ఎలావుంటుంది?

గౌరాంగుడు:-కోసి ముద్దుపెట్టుకుంటాను. శుచీ! సౌందర్య మెందుకు? అనుభవించుటకు కాదూ?

శుచి:-అన్నా! నిత్యాన్నే ప్రేమించు. నిత్యాన్నే అన్వేషించు. కన్నులకగపడేదే క్షణికం. విరి కన్నెలనుచూచి మురిసిపోతావే! గాలి కౌగిటిలో చిక్కినప్పుడు ఆ ఒయ్యారమంతా ఏదీ? దుమ్ములో కలసిపోయింది. తళుక్కున మెఱసి క్షణంలో సౌదామిని శూన్యంలో చేరుకుంది. వింత వింత రంగులతో వెలిగే ఇంద్రధనుస్సు ఒక్కసారి తెలుపులోకలిసిపోయింది. ఏదీ ఇప్పుడా సౌందర్యమంతా? శాశ్వతమనుకొని నీ జీవితమంతా ఒలకపోసుకున్నావు.

గౌరాంగుడు:-ప్రేమలేనిదీ ప్రాణంలేదు. ఆ జీవి చచ్చినా ఎవరూ ఏడ్వరు. నక్కలుకూడా వాని ఎముకలు ముట్టవు. గద్దలుకూడా వానిమాంస మాశించవు. శుచీ! నిన్నే ప్రేమిస్తాను. నీవే నా భాగ్యలక్ష్మివి.

శుచి:-మానవునిలో వట్టిప్రేమ కాదు. ఈశ్వరత్వం సాధించాలని జిజ్ఞాసకూడావుంది. కాని ప్రేమకూ కామానికీ భేదమే లేదా? ఒకటి ఆత్మకు సంబంధించింది! ఇంకొకటి శరీరాన్నే ఆశ్రయించు కుంది. ఒకటి పశువులోపుట్టి విజృంభిస్తుంది. అదే కామం. ఇంకొకటి అమృతంవలె దేవునిలో ఊరుతుంది. మనుష్యునిలో దేవుడూ, పశువూ ఇద్దరూఉన్నారు. ఎవరిని ఆరాధించాలో వాడే తెలుసుకోవాలి.అందుకే వానికి మెదడుంది. అదే లేకుండేవానికీ తిర్యగ్జంతులకూ భేదమేలేదు. కొండంతశరీరం ఏనుగుకూ వుంది. పొదలవంటి వెండ్రుకలు ఎలుగుకూవున్నవి. అమృతవంటిచూపు గ్రద్దకూవుంది. మానవుడంటే ఇంతేనా? ఛీ! సిగ్గు!

గౌరాంగుడు (దీనంగా):-శుచీ! హత్య!

శుచి:-హత్య! జీవకారుణ్యమే మనకు ముక్తిపథం! అందులో అన్ననే చంపుతానా! అయ్యో! సత్యం చెప్పితే హత్య అంటావే! అన్నా! నన్ను కామిస్తూన్నావు. కాని నా ఆత్మ మాత్రం నిన్ను అన్నగా పూజిస్తూంది. నాశరీరం కోరుతున్నావా? తీసికో! కాని నీ కామతుష్టికోసం నా ఆత్మశుద్ధి బలిపెట్టను. అయ్యో! కేవలం బాహ్యరూపానికే పరవశుడయ్యావే! అది దగ్గరలేకుంటే గుండెపగిలి చావవూ? క్షణంలో తనుద్యుతి మాసిపోతుంది. అదే అనశ్వరమని ఆత్మను కాళ్ళక్రిందరాచి పారేస్తావా? పీతాంబరం పైన కప్పినంతమాత్రాన పీనుగును ముద్దుపెట్టుకుంటామా? కళ్ళల్లోని విద్యుజ్జ్యోతి ఆరిపోయింది; శరీరం త్రుప్పుపట్టి పేలికలు పేలికలుగా రాలిపోయింది. ఇంక దేనిని ప్రేమిస్తావు? పిచ్చివాడా! మెఱుపు మాయమైతే ఏడుస్తావు! ఇదేనా నిర్వాణసాధనం?

[మబ్బు ముసుగులోనుంచి చంద్రుడు తొంగి చూస్తూన్నాడు.]

గౌరాంగుడు:-ప్రకృతికీ ఆత్మవుందా? ఎక్కడ? చెప్పు! శుచీ ఆరాధిస్తాను.

శుచి:-నీలోనే నిద్రపోతుంది ఒక చైతన్యమూర్తి. దానిని ముందు మేలుకొలుపు. పిమ్మట ప్రకృతి ఆత్మను కనుక్కో. తలచుకున్నంతలోనే కనబడు తుందా? తగిన పరిశోధనకావాలి! తగిన సంస్కారంకావాలి!

గౌరాంగుడు (ఏం గొణుగుతూన్నాడో తనకే తెలియదు):-'ఓం మణి పద్మేహం!'

[ఆకాశం నిర్మలంగా పాలబుగ్గల పసిపాప చిఱునవ్వువలె వుంది; చంద్రుడు నిరాఘాటంగా రాజ్యమేలుతున్నాడు.]

గౌరాంగుడు:-చెల్లీ! పాపిని.

శుచి:-అన్నా! అలానొప్పుపడకు. పాపివా! కాదులే! పశ్చాత్తప్త హృదయంలో పాపం పటాపంచ లయిపోతుంది. నీకూ మెదడూ, హృదయమూ, జీవితమూ ఉన్నవి. మంచిచెడ్డలు తెలుసుకోగలవు. ఆర్తులనుచూచి 'అయ్యో' అని అనుతాపం చూపగలవు. సాంఘిక పునస్సృష్టికి సాధ్యమైనంతవరకూ పోరాడగలవు. అనుభవంపైన జ్ఞానివి కాగలవు.

గౌరాంగుడు:-చెల్లీ!

శుచి:-అన్నా!

గౌరాంగుడు:-త్రోవ.

శుచి:-ఏదీ?

గౌరాంగుడు:-సత్యమే!

శుచి:-చీకటి కదూ?

గౌరాంగుడు:-ఆ! అవును.

శుచి:-జ్ఞానజ్యోతి వెలిగించు.

గౌరాంగుడు:-అడవి మృగములే!

శుచి:-ప్రేమాస్త్రము లేదూ?

గౌరాంగుడు:-పరమావధి?

శుచి:-పరమపదము.

గౌరాంగుడు:-ఇంక పోదామా?

శుచి, గౌరాంగుడు ముక్తకంఠంతో

"బుద్ధోసు సుద్ధోకరుణా మహణ్ణవో
యొచ్చాంత సుద్ధబ్బర ఞాణలోచనో
లోకస్సపాపూ పకిలే సఘాటకో
వందామి బుద్ధం అహమాదరేణతం"॥

# సిగ్గు

'మణి'

సిగ్గు సిగ్గంటారు
సిగ్గు తగదంటారు
సిగ్గె సింగారమని
ప్రచురించునా పెద్ద!

చెలియ చేతులుపట్టి
చెమ్మ చెక్కాడంగ
పాదసవ్వడి వినగ
సిగ్గు తెరలోదూరి
అట్టె నిలబడియున్న
నన్నుచూడకె పెద్ద
లజ్జ తొందరపెట్ట
లోని కొక్కటె పరుగు!

పెద్ద పరుగిడినంత
పైడిపావడపలుకు
పెద్ద పలికినదంటె
మేన్మిసిమికదలాడ
పూలవాసన లీను!

అడుగడుగునకు కూడ
అనుగు లజ్జాదేవి
అడుగులో నడుగేసి
లయతాళమును వేయ
తలపునకు వచ్చు
నా జయదేవ కవిరాజ
దేవి పద్మావతి.

నిండుజాబిలి మోము
దోబూచు లాడంగ
జారు ముంగురు సరుల
నెడత్రోసి తొలగించి
చిరుగజ్జె స్వనముతో
స్వర్ణ సౌభాగ్యమో
సోయగమ్ము ను చూపి
సుధజిల్కు పలుకొలుకు!

పెదవి విరుపులా కూడ
లలితె హాసమె వెలుగు
ఊర్పు లెగసే హృదికి
అమృతసేచన మౌను!

ఉడ్‌వర్డ్స్ గ్రైప్ వాటర్
బిడ్డలకు వేసవి రాత్రుల
యందు మంచి నిద్ర నిచ్చును






# WOODWARD'S
## GRIPE WATER
*keeps baby well*

I-WW107-111 —TL

W. WOODWARD LTD. LONDON, ENGLAND

# వింతవింతల ప్రపంచం

అమెరికా యునైటెడ్ స్టేట్సులో జార్జి పెటియన్ అనే ఒక సైన్సు ప్రొఫెసర్ వున్నాడు. వానరజాతి మానవజాతికి చాలా సన్నిహితమైనది గదా, పుట్టినప్పటినుంచి తరిఫీదులో తేడావుంటే ఏమైనామార్పు వుంటుందేమో చూద్దామని, ఒకకోతికి పిల్ల పుట్టీపుట్టడంతోటే ఇంటికి తీసుకువచ్చి పెంచడం మొదలెట్టాడు. ఆకోతిపిల్ల పుట్టినతర్వాత తల్లిపాలు ఎరగదు. ఇప్పుడది చాలా పెద్దదయింది. ఆప్రొఫెసరు ఇంట్లో పనిఅంతా దానిదే. సాయంకాలమవగానే ఎలక్ట్రిక్ లైట్లు వేస్తుంది. మళ్లీ అందరు పడుకున్నతర్వాత లైట్లు ఆర్పివేసి పడుకుంటుంది. ప్రొఫెసర్ ఇంటికిరాగానే చేతిలోని బేగ్ మొదలైనవి అందుకుని వాటివాటి స్థానాల్లో పెడుతుంది. డబ్బు మొదలైనవి ఇనప్పెట్టిలోపెట్టి భద్రపరుస్తుంది. కాఫీకాచి ఇస్తుంది. ప్రొఫెసర్‌ను చూడటానికి ఎవరైనావస్తే 'విజిటింగ్ కార్డు' పుచ్చుకుని ప్రొఫెసర్‌కుచూపి వారిని తీసుకువస్తుంది. ఇంట్లో పక్కలువేస్తుంది. బూట్లు తుడుస్తుంది. ఒకటేమిటి ఒక బంట్రోతుపిల్లవాడు చెయ్యగలిగిన పనినంతా చేస్తోంది. అయితే మాటలాడలేదు. 'అమ్మా' 'అయ్యా'అని మాత్రం అంటుంది అంతే. ఇదే కాబోలు సహవాసం వల్ల స్వభావం మారుతుందంటూరు !

♦ ♦ ♦

ఏప్రల్ 20-వ తేదీని హిట్లరుకు 51-వ జన్మదినోత్సవం జరిగింది. అప్పుడు అనేకమంది అనేకమైన బహుమతులు గుమ్మరించారు. వాటిలో లోహంతో తయారుకాబడిన గాంధిమహాత్ముడిబొమ్మ, రవీంద్రనాథ్ టాగూరుబొమ్మ, జవహర్ పండితుడు, సరోజినీనాయుడు, తిలక్, గోక్లేగార్ల బొమ్మలుకూడా వున్నాయి. వాటిని ప్రత్యేకంగా హిట్లరు స్వీకరించి భద్రపరచాడు. హిట్లరు ఎంత రాక్షసుడైనా, అతనిలోనూ మానవత్వంవుంది.

♦ ♦ ♦

'తలక్రిందులు మనిషి'అని పేరుపొందిన ఏలిస్ జెన్ మేక్ హెన్రీ అనే న్యూయార్కు వనిత ఇటీవలనే తన 15-వ ఏట వివాహం చేసుకుంది. గుండె వుండవలసినచోట కడుపు, కడుపు వుండవలసినచోట గుండె కాయివుండడంవల్ల ఆమె కాపేరువచ్చింది. అది ఒక శస్త్రచికిత్సవల్ల బాగుపడిందిట.

♦ ♦ ♦

కొలంబియాలో డాక్టరు హెంప్‌మన్ అనే ఆయన రోడ్డుమీద పోతూవుండగా ఒక కారుక్రింద పడ్డాడు. తక్షణంలేచి కారుడ్రైవరు రెండుకాళ్లూపట్టుకుని, 'రోడ్డుమీదనడుస్తూ మీకారుకు అడ్డంవచ్చినందుకు క్షమించండి'అని ప్రార్థించాడు. అహింసా పద్ధతిని బాగా అర్థంచేసుకుని వుంటాడతడు. అంతా యిలాగే అయితే ప్రపంచంలో శాంతి త్వరలో ఏర్పడకపోతుందా ?

♦ ♦ ♦

ఒక సినీమాలో ఎక్‌స్ట్రాలుగా వేషం వెయ్యడానికి 900 మంది స్త్రీలు కావలసివచ్చి పత్రికలో ప్రకటించారు హాలీవుడ్ అధికారులు. దానికి 7,000 అర్జీలువచ్చాయట—ప్రపంచంలోకెల్లా ఐశ్వర్యవంతమైనదని అనుకుంటూవున్న అమెరికాలోకూడా నిరుద్యోగులు ఎంత ప్రబలంగావున్నారో !

# ★ దేవదాసి

—శ్రీమతి—
దేవులపల్లి
వెంకటరత్నమ్మ

దేవుని దాసియైన దేవదాసి నీచవృత్తికి నిలయమై పోయింది...

పాతివ్రత్యానికి పేరొందిన భారత స్త్రీ యీ దేవదాసీని ఎంతమాత్రమూ ఆమోదింపజాలదు...

కళలు ఎప్పటికి వారికాణాచి కావచ్చు, కాని 'ప్రస్తుతపు దేవదాసి' పూర్తిగా సంస్కరింపబడాలి ★

క్రీస్తుశకము 5-వ శతాబ్దము తరువాత హిందూదేశములో గొప్పగొప్ప దేవాలయములు నిర్మింపబడి దైవసన్నిధిని గానము చేయటానికి, నాట్యమాడడానికి గౌరవకుటుంబములనుండి తల్లితండ్రులచే కొందరు కన్యలు సమర్పింపబడేవారు. వారు 'దేవదాసీలు'అని పిలువబడి దేవాలయములో నివసిస్తూ నాట్యము, గానము చేస్తూ దేవునికి ప్రీతి గొలుపుతుండేవారు. తంజావూరు, జేజూరి, ఉజ్జయిని, కాశీ, మొదలైన దేవాలయాలలో వీరు పవిత్రజీవులై నిష్కామముగా దైవప్రీతికి గానముచేసేవారు. వీరికి దేవుని విగ్రహముతోగాని, పవిత్ర వృక్షముతోగాని నామకార్థము పెండ్లిజరిగేది.

కాలముమారి నాగరికతమారి దేవదాసీలు మారేరు. ప్రభుత్వంవారిని దేవాలయంలోంచి తరిమి వేసినది. హిందూసంఘములో యీ దేవదాసీలు 'గణికలు-నాయకిలు వేశ్యలు' అని పిలువబడే ఒకశాఖగా తయారయ్యారు. పెండ్లిండ్లలోను, విందులలోను, సంతోషసమయాలలోను వీరు గానంచేస్తూ సభికులకు సంతోషాన్ని చేకూరుస్తున్నారు. పూర్వము ఒకప్పుడు పవిత్రజీవులై గానకళోపాసకులై నాట్యకళానిధులైన దేవదాసీలు యిప్పుడు వ్యభిచారమే వృత్తిగా, మంసము త్రాగుడు ఆహారములుగా, రోగములే ఆభరణములుగా, పాపకార్యాలే కర్తవ్యములుగా యెంచి హిందూసంఘానికి, హిందూ స్త్రీత్వానికి అగౌరవము ఆపాదిస్తూన్నారు. నాడు మత, దైవ, ఆధ్యాత్మిక, సంబంధమైన గానరసముతో ప్రజలకు దైవచింత నేర్పే దేవదాసీలు నేడు జావళీలతో, సరసాలతో, తళుకుబెళుకులతో యువకులను ఆకర్షించి ధనం గుంజుకుని శరీరం పాడుచేసే పిశాచగణంగా మారేరు. పూర్వం దేవాలయంలో ధూప సువాసనలమధ్య దైవసాన్నిధ్యాన్ని, మోక్షమార్గాలాలోచించేవారు యిప్పుడు కుట్రలుపన్నుతూ హత్యామార్గాలాలోచిస్తూ, పొగచుట్టా, బ్రాంది మొదలగు దుర్వాసన సామగ్రులతోనున్న విటులకు హాయిగొల్పుతున్నారు.

వీరికి తరుణోపాయములేదా? జీవనోపాధి మరొకవిధముగా దొరకదా? వివాహసంబంధమయిన సౌఖ్యము మరొకలాగున చేకూరదా? ప్రభుత్వము వీరిని దండిస్తూంది. వూరి వెలుపలకి పొమ్మంటూంది. యింతేగాని యీ వృత్తిమానినట్లైతే తిండిపెట్టుతాననదు. సంఘములో గౌరవస్థానమిస్తాననదు. ఉచితముగా విద్య నేర్పుతాననదు!!

గత్యంతరములేక కులహీనులని పేరుపడిన వీరు తప్పు మార్గాలను అనుగమిస్తూన్నారు గాని యీ నీచజీవితము వారికిమాత్రము యిష్టమా? వారిలో నూటికి తొంభైమంది తల్లి ఆజ్ఞాపిస్తే "దైవమా నన్నెందుకీ కులములో పుట్టించేవు? యీ నీచవృత్తి ఏలాగు అవలంభించడం? ఎప్పటికైన మాజాతికి తరుణోపాయము లేదా!" యని యేడ్చి విధిలేక ప్రాణపోషణమైన తిండికోసం కాని పనులు చేస్తూన్నారు.

వీరికొకటే తరుణోపాయము. దానికి ప్రభుత్వసహాయ మవసరము. ప్రభుత్వం వీరికితగిన విద్య నొసగి, క్రొత్త పంథాలను తీసుకొనివస్తే, భారతదేశసౌభాగ్యాన్ని వీరు ఎన్నోవిధాల చేకూరుస్తారు. వీరి వృత్తి మాన్పించి వైద్యవిద్య వీరికి నేర్పితే, అసంఖ్యాలైన ప్రసూతి మరణాలు, శిశుమరణాలు, స్త్రీరోగాలు హిందూదేశములో రూపుమాపి, స్త్రీలకు నూతనశక్తి చేకూర్చి, సౌభాగ్యప్రదాతలౌతారు. కొందరను ఉపాధ్యాయినులుగ తయారుచేస్తే దేశములో నిరక్షరాస్యతను నిర్మూలముచేసి, బాలబాలికలకు కావలసిన విద్య సులభముగనొసగి, రాబోవుతరముల హిందూజనులను అతిజ్ఞానయుక్తులుగా జేస్తారు. కొందరకు కళల నేర్పితే ప్రాచీనభారత కళాఖ్యాతిని పునరుద్ధరిస్తారు. కొంతకాలానికి వీరికి సంఘములో గౌరవస్థానము దొరుకుతుంది. హిందూదేశాన్నికి దాస్యము తొలగిస్తారు. ప్రజలను తరిపింపజేస్తారు, భారతమాత కన్నీటిని తుడుస్తారు. వీరికి తరుణోపాయము ప్రభుత్వముచేతులలో నున్నది. దేశసేవకు, మానవసేవకు, సిద్ధముగానున్న వీరికి విధిఅనుకూలించి, ప్రభుత్యసహాయము లభించేటట్లు చేయకపోతుందా? మనదేశము వీరిసహాయముతో నిత్యకల్యాణముతో విరాజిల్లకపోతుందా!!

## భరతధాత్రి - పరాశక్తి

గాంగసీమంత సంఘటిత సస్యశ్యామ వనరాజి వాల్జడవన్నెగాగ
నీహార గిరిరేఖ నిర్యదిందుచ్ఛాయ దళుకొత్తు జాజిపూదండగాగ
లలితకళావాస కలిత కాశ్మీరంబు పాలుపైన పాపట బొట్టుగాగ
నర్మదా పులిన సాంద్రతమాల వనవాటి ఘటితేంద్ర నీలమేఖలముగాగ
కన్యాకుమార్యగ్ర కమనీయ పదసీమ దంబైన పాదపీఠంబుగాగ

సేతువది నీదు చరణ మంజీరమైన
నీభరతధాత్రి నీవుగా కెవ్వరమ్మ!
ఏము నీ బిడ్డలముగాక యెవరమమ్మ!
అంబ! సుగుణకదంబ! హేరంబజనని!

—విద్వాన్ శ్రీ కల్లూరి వెంకట సుబ్రహ్మణ్య దీక్షితులు.



నవ్యకళావారి 'మీరాబాయి'లో

మీరాబాయి మిస్. చలం





### శ్రీమతి సరోజనీదేవి

తిరునల్వేలి మండల రాజకీయ మహాసభలో ప్రారంభోపన్యాసము నిచ్చి, తమిళ రాష్ట్రమంతయు సంచారముచేసి దేశ సేవకై ప్రజల నుద్బోధించిరి.





‘ చూపు నిలకడ ’

# కన్నీటి కెరటాలు

కన్నీటి కెరటాలు కలతగూర్చెనె తల్లి,
పన్నీటి స్నానాన పరిఢవిల్లెడు మాత,
ఆంధ్రగృహిణులసేవ కంగలార్చితె, యంబ
నీ యాంధ్రభూమిలో నిలిచిపొక్కె తల్లి
కన్నీరువీడుమమ్మా,
ఆంధ్రిలో, కలకాలముండుమమ్మా.

★ ★

కన్నీటి కెరటాలఁ గలిగిపోయెను ప్రాత
కనకంపుమణులెన్నొ కాలగర్భమ్ములో
మున్నీటిబాధలను మునిగి నశియించెగా
మునుపునిలిచిన నారి మోదమదియెల్లా
రాణి రుద్రమవోలు రాణులిలనేరీ
కవయిత్రి మొల్లాంబ ఘనతభువినేదీ
ఆంధ్రమాతా, శోకమణచుకోతల్లీ

ఆంధ్ర స్త్రీలకు కార్యమరయుమో తల్లీ
కన్నీరువీడుమమ్మా
ఆంధ్రిలో, కలకాలముండుమమ్మా.

★ ★

కన్నీటి కెరటాలు కడలివలె పొంగేయి,
వెన్నెల విహారాలు విరమింపబడ్డాయి
తొల్లి ఆంధ్రిని వీరతోయజాక్షులతోనె
చల్లగా కాలంబు జరిగిపోలేదే ?
నాటిరోజులకొఱకు నలతేలనమ్మా
కన్నీరుమున్నీరుగా నేడ్వకమ్మా
ఆంధ్రమాతా, మమ్ము నరయుమో కొమ్మా
నీ యాంధ్రభూమిలో నిలిచిపొక్కె తల్లి
కన్నీరు వీడుమమ్మా
ఆంధ్రిలో, కలకాలముండుమమ్మా.

—శ్రీమతి వక్కలంక రామాబాయి.

# మలేరియా
## అంటువ్యాధి




# సంగీత సామర్థ్యం

**కమలకు:—**

నిజమే! నా హృదయంలో ప్రక్కదారులలో పరవళ్లు త్రొక్కుతూఉండే ఈ ప్రపంచాన్నంతా ఒక్కమారు ఊగించివేయాలని ఉబలాట పడే భయంకర తుపాను రేగుతూఉన్న మాటమటుకు నిజమే! కాని నీల అనుకుంటూఉన్నట్టు దానికి కారణం సంఘం, అనాథరాలనైన నామీద చూపిన దయా దాక్షిణ్యాలు, న్యాయం ఎరుగని క్రూరమైన చూపులుమటుకు కాదు. "మార్పు, మార్పు" అని ఏనాటినుండో నాగుండెల్లో ఒకహోరు, ఒకరొద ప్రతిధ్వనిస్తూఉంది. ఆరొదే యీనాటి ఈ సంస్కరణాభిలాష, భావి విప్లవగీత అని ఏనాడో గ్రహింప గలిగేను నేను.

అయినా, ఎందుకు అలా విరుచుకుపడుతుంది నీల నామీద? పాషాణ హృదయాల్నికూడా ద్రవీభూతం చేయగలిగిన సంగీతాన్ని హూణవిద్య నభ్యసించే తన పిల్లలకు నేర్పమని అన్నిసార్లు ప్రాధేయపడి బ్రతిమలాడేననేనా? ఆమెనుచూచి, ఆమె పిల్లలనుచూచి నేనెంత జాలిపడుచున్నానో ఆమెకేం తెలుసు. తనకు తెలియని కారణంచేత మాతృమూర్తి తన చిరుపాపలను హృదయ వికసనానికి అనువైన కళలకు దూరం చేసి, నాశనంచేసివేస్తూఉంటే కళ్ళారాచూచి ప్రాధేయపడి బ్రతిమలాడకుండా ఎలా ఉండగలను? కోపం ఎందుకు? కావలిసింది ప్రశాంతతతో కూడిన ఆలోచన—

అయినా, సంగీతం మోడైన మ్రానులను చివురింపగల ఆదిశక్తి అని, స్వర్గకాంతులను భూమిపై వెదజల్లగల దివ్యమూర్తి అని ఎన్నోచోట్ల చదివి, అవన్నీ కల్పవృక్షాల్లాగు నరకబాధలలాగు కవికుమారుల స్వకల్పితాలని ఊహించుకొని అంతటితో శాంతపడేనీలకు పిల్లలకు సంగీతం నేర్పడంలోఉన్న ఆవశ్యకత ఎలా కన్పిస్తుంది? నేనేమైనా అంటే, "నీవూ, నానీనూ, ఎప్పుడూ తయారుకాని ప్రపంచాన్ని విప్లవ వీధుల్లో నడిపించాలని ఉబలాటపడతారు. అది అంత సమంజసంగా కన్పించదు నాకు" అంటుంది.

అసలు సనాతన సిద్ధంగావచ్చే ఆర్ష సాంప్రదాయ ప్రకారం ఈ విశ్వమంతా కొన్ని రంగురంగుల ఆకారాల సమ్మేళనం. ఆ ఆకారాలు కొన్నికొన్ని శబ్దాలమీద ఆధారపడి ఉంటాయి అని యోగదృష్టిలో లీనమైన ఆర్యఋషులు కొన్నివేల సంవత్సరాలనాడు గ్రహించి తత్ఫలితంగా యీలోకానికి మంత్రయోగాన్ని ప్రసాదించారు. అలా, చిత్తవృత్తిని అరికట్టగల మంత్రయోగమే మానవవాక్కుమీద, శబ్దప్రయోగముమీద, స్వరముల కదలికమీద 'ఆధారపడి ఉన్నప్పుడు వీటిమీదే ఆధారపడిన సంగీతజ్ఞానము ఎంతశక్తివంతమో, గ్రహించుకోలేమూ? చేతనాచేతన ప్రకృతినంతా సమ్మోహితులను చేయగల శంకరాభరణ, తోడిరాగాలతో, విశ్వకల్యాణాన్ని ఆలాపించగల కల్యాణులతో, హృదయ తంతుల్ని కదలించగల

శహాన, నాదనామక్రియలతో ఊగిపోయే సంగీతమే హృదయాన్ని వికసింపచేయ లేకపోతే ఇంకా ఏది ఆపని చేయగలుగుతుంది?

ఇది కాకుండా, సుశబ్దాలను, సుస్వరాలను వినడంవల్ల చిత్తవృత్తిని అరికట్టగలమని లయయోగము చెప్పుతుంది. ఈ సుస్వరములు, మానవహృదయపద్మముయొక్క ఎనిమిది రేకులలో ఏదో ఒకమూల ఒదిగి ఉన్న ప్రాణవాయువును ఆత్మకు మాతృస్థానమైన హృదయ పద్మముయొక్క మధ్యభాగమునకు తీసికొనిపోయి ఆత్మవికసనానికి దారులు తీస్తవి.

ఇలాంటి సంగీతాన్ని పిల్లలకు నేర్పమంటే పిల్లలవాక్కును శుచియైన మార్గాలలో నడిపించ మంటే, పిల్లలవీనులు లయకొరకు ఎదురుచూచేటట్లు అలవడపరచమంటే, ఎందుకు అంత కినిసిపోతూఉంది నీల?

అయినా, ప్రాణలీలను తాండవమాడించిన గోపాలకృష్ణుని మురళీరవాన్ని, నిత్యనూతన నృత్య కేళితో అనుదినమూ అవధరించే నటరాజు ఢమరు నినాదాన్ని, "సంగీత జ్ఞాన విహీనులకు మోక్షము కలదా, భువిలో"అని పాడుకొన్న మహాభక్తుని త్యాగయ్యను, మరచిపోయిన ఆంధ్రప్రతిభ ఇంకా జీవించి ఉన్నదని అనడానికి హక్కు ఏమిటి మనకు?

ఇదే విప్లవమైతే మేము విప్లవవాదులమే! ఆ విప్లవమునకు ఆంధ్రలోకాన్నంతా సదా సహాయము చేయమని ప్రార్థిస్తూనే ఉంటాము!!!

సదా నీ సహాయాన్ని కోరే,
'మణి'

## ప్రేమ

ఆగుము నాసఖా! వనవిహారము సేయగ నేను వత్తునం
చీగతి నడ్డుపెట్టెదవదేటికి? నీకడ గూరుచుండినన్
సాగునె నాకు, నల్లవిగో జాజులు మల్లెగులాబులెల్ల నా
యాగమనంబుకై ప్రియత నారయుచున్నవి చూడుమో సఖీ!
ప్రియమున నాదుజాడగని పేర్మిసుధామధు మాధురీ సము
చ్చయ శుభశోభితాకృతులుసంధిల, పుష్పాడితా వినుమ్మనన్
నయనముదావహంబుగను నాట్యము సేయుచునుండె నిట్టటుల్
రయమున నన్ను వానిపయి వ్రాలిసుఖింపను బిల్చుటోయనన్.
నాకును తత్ప్రసూన నటనా పరిశీలనభాగ్యమబ్బె నా
కాకుసుమంబులంగలసి యాడగ డెందముగుందుగాని, యా
హా! కనుగొమ్ము నందనవనాంతర రమ్యప్రదేశ దేశముల్;
ఆకసమందు పూర్ణశశినారసి చుక్కనుచూతువే సఖా!

—శ్రీ ఆకుండి వెంకటేశ్వరరావు





# మీ సౌందర్యమును కాపాడుకొనుడు

మీభర్త, మిత్రుల హాసన్ముఖమునకు కారణము మీముఖ సౌందర్యమేయని మీకు తెలిసిన మీరెంత సంతసింతురు. మనోహరత్వము తప్ప మరేదియు అతిస్వల్పకాలములో మెప్పువడయజాలదు.

మీ చర్మముపై తగిన శ్రద్ధవహించిన అమోఘమైన దేహ సౌందర్యమును పొందగలరు. ప్రతిదినము మీచర్మ రంధ్రములలోకూడిన మురికిని, నూనెనుతీయుట మొదటిపని. సబ్బుతో కడుగుట మాత్రమే చాలదు.

నిత్యము పాండ్స్ క్రీమును వాడుడు. చర్మమును శుభ్రపరచి, మృదుత్వము గల్గించుటలో పేరుగన్నది. ఇది ప్రతిరంధ్రములోనుపోయి మురికిని పూర్తిగాతీసి చర్మమునకు పుష్పదళ మృదుత్వము, యౌవనము నిచ్చును.

పాండ్స్ కోల్డ్ క్రీమును ప్రతిరాత్రి, ప్రొద్దున పట్టించుడు. చర్మముమీద వ్రేలితో క్రిందినుండి పైకి మెల్లగా రాయుడు, కొంతకాలముట్టుంచి తరువాత మృదువైనగుడ్డతోగాని, పాండ్స్ టిష్యూతోగాని శుభ్రముగా తుడుచుడు. మరొకసారి ఇదేవిధముగా జేయుడు. మీ చర్మము ఎంత మేలుచెంది మృదువుగా ప్రకాశవంతముగా నుండునో మీరే చూడగలరు.

పగలు ఎండ, గాలి, దుమ్ము వీటినుండి రక్షణపొందుటకు పాండ్స్ వ్యానిషింగ్ క్రీమును ఉపయోగించుడు. ఏకొద్ది గరుకుదనమునుకూడా పోగొట్టి పౌడరు చక్కగా అంటునట్లు చేసి అందమును కలుగజేయును.




**పాండ్స్ కోల్డ్ క్రీము :** చర్మమును శుభ్రపరచి మృదువుగా నుంచును. దినము రాత్రిప్రొద్దున ఉపయోగించుడు.




**పాండ్స్ వ్యానిషింగ్ క్రీము :** చర్మమును ఎండ, గాలి వీటినుండి రక్షించి, మృదువుగాజేసి, పౌడరు బాగుగాపట్టునట్లు చేయును.

## పాండ్స్ క్రీమ్

# దేశభక్తి

గీ. మొగలురాచతీకఁపు దండిమగలకఱుకు, కత్తులందలి నెఱమాని కంపుఁగొంపు
దిగువనీడల భారతదేశలక్ష్మి, శిరమువాల్చి ప్రొద్దుపుచ్చిన దినాలు.

చ. యవన పటుప్రతాపవిలయానలదీర్ఘశిఖాచయమ్ము శా
త్రవ బలదర్పగోచులఁ బరాజయధూమములందు ముంపఁ హైం
దవజనగౌరవమ్ము పరతంత్రతకౌదల యీయరాదు, ఆ
హవమునఁ గత్తిపోటులె సుఖావహమన్నది; యామె యొక్కతే.

సీ. అనిఁ గత్తిపట్టినిల్చిన దండిమగలకు నూత్న దీక్షాశక్తి నూరిపోసి,
జాతీయతానలజ్వాల హైందవ వీరరక్త నాళమ్ముల రవులు కొల్పి
తనప్రతాపానలోద్ధత శుభారుణ రేఖ దేశమాతకు రత్న దీపమెత్తి
స్వాతంత్ర్య సమరనిష్ఠల మాతృభూమికి ప్రాణాశుగమ్ములు పాయనమిడి.

గీ. జీవనరథమ్ము స్వచ్ఛందభావవీధి ద్రిప్పుకొనుచుండి కీర్తిపొందినది; గోండు
రాణి దుర్గావతీదేవి రక్తి నామెపేరు భారతహృదయాల మారుమ్రోయు.

చ. మొగలు ప్రతాపదర్ప మరిమూకల గుండెలఁ జిచ్చువెట్టి పా
ఱఁగఁ గని భారతీయుల పరాక్రమ రేఖలు మాసిపోవ పె
ల్లుగరణ భూమినిల్చినతలోదరి భారతదేశరాజ్ఞి; యా
మగువ యుపాస్యదేవత; యమానుష విక్రమమూర్తి గావునన్.

చ. కరిహయ బృందముల్ సమసి, కాల్బలమెల్ల నశించి యోధు లె
ల్లరు హతులై, ప్రియాత్మజుడిలంబడియున్ మది ధైర్యలక్ష్మి నే
పురిగొని జాతిగౌరవ విభూతికి భంగము రాకయుండ మో
హరమున నొంటిమైనిలచె; నాయమదెంతటి దేశభక్తియో.

ఉ. అంగనయైన నేమి హృదయంబు గభీరస్వతంత్ర భావనా
రంగము; దేశగౌరవమె ప్రాణము మాకనిజాటి చెప్పి పో
రొంగద, యట్టికాంత యుదయించిన భారతమాత గర్భమె
న్నంగ మహాపవిత్రము; జనంబులునన్నిట నామె బిడ్డలే.

ఉ. ఆహవభూమి ఖడ్గమున కాహితరక్తమరందబిందు సం
దోహము విందుచేసికొని, దుర్గమరాజ్ఞి పవిత్రమూర్తియై
దేహమువాసె నాస్థలమదే యిపుడున్నది, పూర్వవైభవం
బూహకు దెచ్చి జూడ్కులకయో యనిపించును పుణ్యభూమియై.

గీ. ఈ మహారాణి రణభేరులేమొ; కాక తూతిగుట్టలు, రాజ్ఞి పరాక్రమంబు
జాటుకొనుటేమి? యిప్పుడచ్చోట రాత్రి శ్రుతిపుటమ్ముల బడుమహాద్భుతరవమ్ము.

—శ్రీమతి గంటి కృష్ణవేణమ్మ.

# భావతరంగిణి   

'మనస్త్రీల అభివృద్ధికై యెవ్వరును శ్రద్ధవహించడంలేదు. స్త్రీలలో పనిచేయుటకు చాలమంది దేశసేవికలు కావలసివున్నారు. స్త్రీలు, పురుషులు వేరువేరు జట్లుగా వుండటం మంచిది. ఇరువురి సంబంధములు సహజముగా ఉండాలి గాని కఠినమైన నియమాలను నేను విధింపజాలను'

—మహాత్మా గాంధీ.

"భారతదేశ గౌరవము నేడు దశదిశలు వ్యాపించియున్నదంటే దానికి భారతమహిళా ప్రపంచముయొక్క అనన్య సామాన్యమైన ప్రవర్తనయే కారణము.. వారు కళోపాసకులగుటచే గృహములకును, తద్వారా దేశమునకును శాంతి సౌఖ్యములను చేకూర్చుదురుగాక అని కోరుతున్నాను."

—పండిత జవహర్‌లాల్ నెహ్రూ.

"భారతీయులు పాకిస్థాను, సనాతనిస్థానులవిషయమై తగవులాడుతూ వున్నంతకాలము స్వాతంత్ర్యమునకు అర్హులము కాజాలము. ప్రస్తుతము ఐకమత్యము ముఖ్యావసరంగాఉంది. గత యుద్ధంలో బ్రిటిషువారు, వారి రాజకీయ విభేదాలను మరచిపోయి, ఒక్కనిగ శత్రువును ఎదిరించారు. పురుషులు యుద్ధభూమికి వెళ్లినప్పుడు వారి స్థానము స్త్రీలాక్రమించారు... భావములోగాని, కార్యాచరణంలోగాని ఐకమత్యము లేకపోయిన ఏజాతియు జీవించు హక్కుకలిగివుండదు."

—శ్రీమతి సరోజనీనాయుడు.

"ఖద్దరు ప్రచారం, గ్రామపరిశ్రమలు, అస్పృశ్యతానివారణ, ప్రతిదినమును తప్పకుండా స్వయంగా నూలువడకుట, హిందూ ముస్లిం మైత్రి మొదలైన కాంగ్రెసు కార్యక్రమములోవున్న అంశాలనన్నిటిని మహారాష్ట్రింలో స్త్రీలందరూ కొనసాగిస్తూ ఉండాలి. అందువల్ల సత్యాగ్రహమును ప్రారంభించడానికి తగిన పరిస్థితులు దేశంలో కలుగుతాయి. అవకాశంవున్న స్త్రీలు సత్యాగ్రహ ప్రమాణాలమీద సంతకాలు చేసి వలంటీరులుగా చేరాలి."

—శ్రీమతి లీలావతి మున్షి.

"వెనుక కాంగ్రెసువారు స్వరాజ్యంకోసం సత్యాగ్రహం జరిపినప్పుడు అన్నిసారులూ భారత స్త్రీలు చాలా ప్రశంసనీయంగా పనిచేశారు. స్త్రీలు పురుషుల కధికమైన ప్రోత్సాహమును కలిగిస్తూ వారికి తీసిపోకుండా పనిచేశారు. ఈసారి స్వరాజ్యంకోసం కడపటి సత్యాగ్రహం జరుగుతుంది. అప్పుడు స్త్రీలందరు వెనుకటికంటె చాలా అధికంగానే పనిచేయాలి. స్త్రీలందరు సత్యాగ్రహ ప్రమాణ పత్రాలమీద సంతకాలుచేసి మొదటితరగతి వలంటీరులుగా చేరాలి."

—శ్రీమతి సుచితా కృపాలిని.

# పల్లెటూళ్ల సాంఘికదుస్థితి



శ్రీ ఆదిలక్ష్మీ వేంకటరత్న సోదరీలు

---

> భారతదేశ సౌభాగ్యం పల్లెటూళ్లలోనే ప్రతిఫలిస్తుంది. అటువంటి పల్లెటూళ్ల సాంఘికదుస్థితి దుర్భరంగా వున్నంతవరకు మనం ముందుకుపోలేము. నేటి మన నవ్య ప్రపంచ నిర్మాణానికి పల్లెటూళ్లే కార్య క్షేత్రాలుగా మారిపోవాలి—

పట్టణములయందువలెఁగాక పల్లెటి గ్రామములలో కులకట్టుబాట్లు కఠినరూపములఁ దాల్చి యుండును. పల్లెలయందు విద్య శూన్యము. అందును స్త్రీవిద్య పూర్ణానుస్వారము. బాలికలను స్వంతయింటి యరుగుమీదకైనను రానీయరు.

కొన్ని పల్లెలయందలి బాలికలను యింటియందల్లరి చేయకుండగ చంటిపిల్లల నెత్తుకొని యాడించ గల యీడువచ్చువరకు బడికి పంపించి తర్వాత మానిపింతురు. పల్లెయందు వెయ్యికొక్కరైనను ప్రాథమిక విద్యనేర్చినవారుండరు. "బాలికలవిద్య భర్తకుత్తరము వ్రాయుటకని" కొందరి మతము.

పల్లెటూరివారు వారి బిడ్డలను పట్టణములందలి విద్యావంతులకో, లేక నుద్యోగుల బిడ్డలకో యెక్కువ కట్నములనిచ్చి యుద్వాహము చేయుటయు, ఆ బాలికలు విద్యాశూన్యులగుటచే పడునరకబాధలు చెప్పుకొనుటయును, వినుటయునుకూడ మిగుల బాధకరము. పల్లెలలోని కోడండ్ర నన్యాయముగా అత్తలు ఆడు బిడ్డలు కత్తులబోనులందుంచి కాపురము చేయించుకొందురు. మరియు, కట్నములు, లాంఛనములు జరుపుటలోగల పూర్వపు లోపములకొఱకు ఆ కోడండ్రత్తలగువరకు పడుయమయాతనలు తలప నశక్యము.

పల్లెలలోని బాలవితంతువుల బాధలను జూచిన హృదయము బ్రద్దలగును. సనాథలగు వారిస్థితియే శోచనీయముగనుండ అనాథలగు వారిస్థితి వేరుగ జెప్పవలయునా? అసలు స్త్రీ లోకమే మూఢాచారములకు గురియై, విద్యాగంధములేక, స్వార్థపరత్వపు మైకములో పడియల్లాడుచున్నది. పట్నవాసపు స్త్రీలోకింత విద్యావతులైనను, కానివారికంటె కనికష్టముగ నున్నారు. ఇక మూఢనమ్మకముల కాటపట్టైన పల్లెగ్రామములయందలి స్త్రీలమాట చెప్పవలయునా?

ప్రపంచములో నేదైన యొకక్రొత్త యాచారము ప్రాత వాటి స్థానములో నుత్పన్నము కావలెనన్న, దానిని అందరు ఆదరింతురుగాని, స్త్రీలు ఒక్కపట్టున ముందుకురారు. ప్రాతపద్ధతిని విడువవలెనన్న స్త్రీ జాతికి ప్రాణముపోవును. అందును పల్లెటూరి స్త్రీలకుగల పట్టుదల అత్యధికము.

సంఘములోనున్న నేటి యవినీతి దురాచారములు నశించవలెనన్న, ముందుగా పల్లెస్త్రీల దుస్థితి బాగుపడవలెను. వారు యభివృద్ధి స్థానమునకు వచ్చిన వెంటనే సంఘమునందు కనివిని యెరుగని మార్పొదయించును. అప్పుడు సంఘజీవితము సౌఖ్యవంతము కాగలదు.

ప్రస్తుతము పల్లెలలోని బాలికలకు, స్త్రీలకుఁగలుగు నక్రమములదీర్చు పుణ్యాత్ము లిప్పటికెవ్వరును గానరారు. మహిళాసభలు, మహిళా గ్రంథాలయములు పట్టణస్త్రీల పురోభివృద్ధికిగాని తమ యావద్భారత స్త్రీల క్షేమముకొఱకుకాదు. స్త్రీల నాయకురాండ్రింతటనుండియైనను సమదర్శినులై ప్రతి పల్లెయందును ప్రచారముచేసి మహిళాసంఘములను స్థాపించి సమస్తవిధముల స్త్రీ లోకముయొక్క పురోభివృద్ధిని గోరుచు, అనాథస్త్రీలను, నిరక్షర వనితాలోకమును నుద్ధరించుటకు తగుమార్గముల జూచి పనిచేయుదురుగాక!

# లౌంజ్ సూటు

● శ్రీమతి పి. ఎన్. ప్రకాశమ్మ



కిరీటిరావు:-సుందరీ! ఉత్తరాలేమైనా వచ్చాయా?

సుందరి:-మాంబళం అడ్రస్సుకి ఏదో కవరొస్తే మావాళ్లు పంపించారు.

కిరీ:-ఖర్మం చాలక ఎప్పుడో మామగారింట్లో ఓ నెల్లాళ్లుంటే ఎల్లకాలం అక్కడే ఉన్నాననుకొని, నాకుత్తరాలు రాసేవాళ్లంతా మీనాన్న 'కేర్'కే రాస్తూన్నారు.

సుం:-ఏమండీ, మానాన్న ఎడ్రస్సుకి మీ ఉత్తరాలొచ్చినంతమాత్రాన్ని ఆయన సంరక్షణలో మీరుండిపోయినట్లు లోకం అనుకోపోతుందనా మీ భయం?

కిరీ:-నాన్సెన్సు! నేనొకటంటే నువ్వొకటర్థంచేసుకుంటావ్! నీతో వచ్చిన చిక్కే ఇది. ఏదీ ఆ కవరెక్కడుందీ?

సుం:-అద్దం వెనకాల పెట్టేను. ఏదో ఆహ్వానంలా ఉంది.

కిరీ:-(కవరువిప్పి) సుందరీ! నువ్వుచెప్పినట్లు ఇన్విటేషనే. కాని ఎవరుపంపించారో తెలుసా?

సుం:-తోటి గుమాస్తా ఎవడింట్లోనో పెళ్లి కాబోలు.

కిరీ:-(కోపంతో) అంతే! నీబుద్ధి అంతకి పైకిపోదు. నేజేసేది గుమాస్తా నౌఖరీ కనక నా స్నేహితులంతా గుమాస్తాలే అనీ, నాకెప్పుడు ఇన్విటేషనొచ్చినా ఏ చచ్చు గుమాస్తానో పంపుంటాడని నీ అభిప్రాయం. నన్ను ఏదోవిధంగా చులకనచేస్తే మాట్లాడ్డమే నీక్కావలసింది.

సుం:-(ఆశ్చర్యంతో) రామ! రామ! నేనలాంటి ఉద్దేశంతో అనలేదండీ. దీనికేంగాని ఎవరిదగ్గర్నుంచొచ్చిందీ ఆ కవరు?

కిరీ:-(సగర్వంగా) గవర్నరుదంపతుల దగ్గర్నుంచి. లార్డు ఎర్స్కిన్ అండు లేడీ మేర్జరీ ఎర్స్కిన్‌లు పంపేరు. ఏమనుకున్నావో! ఆ గవర్నమెంటు ముద్రచూస్తే తెలీటం ల్లేదూ నీకు? అప్రక్క సింహం, ఈప్రక్క గుఱ్ఱం, పైన కిరీటం! వారె! గిల్టుతో అచ్చుగుద్దేరు. బంగారులా మెరిసిపోతోందీ ముద్ర.

సుం:-నిజంగానే? గవర్నరేనా పిలుస్త? ఎందుకోసమండీ ఆహ్వానం?

కిరీ:-ఇక్కడ సైన్సు కాంగ్రెస్సవుతోంది. దానికోసం, ఇండియాలో ఉన్న గొప్పగొప్ప సయింటిస్టులంతా సమావేశమయారు. వీళ్లందరికీ గవర్నరుగారు టీపార్టీ ఇస్తారుట.

సుం:-ఉహూ! సరేకాని......పోనీలెండి నాకెందుకు?

కిరీ:-అదేమన్నమాట! సందేహించక అడిగేయ్.

సుం:-ఎందుకు? మీకోపం వస్తుందనవసరంగా.

కిరీ:-రాదు, చెపుదూ అదేమిటో.

సుం:-సైన్సువాళ్లకిచ్చే టీపార్టీకి, లోకల్‌ఫండాఫీసు గుమాస్తాలను పిలవడమెందుకోసం చెప్మా అనుకుంటున్నా.

కిరీ:-(నిస్పృహత్వంతో) నీమొగుడు నీకంటికి లోకల్‌ఫండు గుమాస్తాకంటె ఎక్కువగా ఎన్నడూ అగుపించడు! అందుకే అందరితో నామొగుడు 'గుమాస్తా' 'గుమాస్తా' అని చాటిచెబుతున్నావ్.

సుం:-చాటిచెప్పడమేమిటండీ! ఎవర్లేనా అడిగినప్పుడు చెప్పకపోతే ఎలాగ?

కిరీ:-గుమాస్తా అనే కాని చెప్పడానికింక ఉద్యోగాల పేర్లే లేవేమిటి?

సుం:-(ఆశ్చర్యంతో) అయితే మిమ్మల్ని ఎవరైనా అడిగినప్పుడు మీరేమని చెబుతున్నారు?

కిరీ:-'ఆఫీసులో సూపరెంటెండెంట'ని చెపుతున్నా. మొన్న ఆమధ్య ఓ పెద్ద ఉద్యోగస్థుడికీ నాకూ పరిచయమై అతడడుగుతే అలాగనే చెప్పాను. అతడికి గవర్నమెంటుహౌస్‌లో ఏదో పెద్ద ఉద్యోగ మట. బహుశః ఆయనే నాకు ఈ ఇన్విటేషను పంపుంటాడు. ఒహో. ఈ క్రింద ఏమిటో రాసుందే! మార్నింగు డ్రెస్సు, లేక లాంజ్ సూట్.

సుం:-అంటే?

కిరీ:-పార్టీకి వెళ్లేటప్పుడు అడ్డమైన అవకతవక డ్రెస్సుల్లోనూ వెళ్లకుండా, మార్నింగు డ్రెస్సులో కాని, లాంజ్ సూటులో కాని వెళ్లాలట. మార్నింగుడ్రెస్సంటే ఏమిటో?

సుం:-అదోరకం డ్రెస్సు కామోసు.

కిరీ:-ఆమాత్రం నాకు తెలీకపోలేదు.

సుం:-డ్రెస్సు వివరాలు కావలిస్తే, టెయిలర్ని కనుక్కుంటే తెలిసిపోతాయి.

కిరీ:-ఇదుగో, ఈ కవర్లోనే ఏదో అచ్చుకాగితం ఒకటుంది. ఉండు చదువుతా. ఒహో, ఇంకనే? పోర్టుసెంటుజార్జి గెజెట్లో, అచ్చువేసిన ప్రచురణ—గవర్నరుగారిచ్చే పార్టీలకు వెళ్లేటప్పుడు వేసుకోవలసిన డ్రెస్సు వివరాలను గురించినది ఇందుతో పంపేరు.

సుం:-ఏమిటది?

కిరీ:-విను 1 జరీఅంచు ఉన్నదికాని, లేక కేవలం తెల్లనైనదికాని తలపాగ. 2. మెడబొత్తాంగల నల్లటి లాంకోటు—ఖండువా కావాలంటే వేసుకోవచ్చు, లేకపోతే మానెయ్యవచ్చు. 3. ట్రవుజర్లు తెలుపుగాని నలుపుగాని కావచ్చును. లేనిచో పంచ పనికివచ్చును. 4 నల్లటిస్టాకింగులు, పేటెంటు లెదరు బూడ్సు.

సుం:-ఈ డ్రెస్సు వేసుకుంటే మీరుచాలా బాగుంటారు.

కిరీ:-లేకపోతే బాగుండననా! నేను ఏడ్రెస్సు వేసుకున్నా బాగానేఉంటా. మీ అన్నలాంటివాళ్లు ఏడ్రెస్సు వేసుకున్నా బాగుండక ఆడ్రెస్సు గౌరవంకూడా పోగొడతారు

సుం:-(కొంచెం చిన్నబోయి) పోనీలెండి వాడిఅందం గొడవెందుకిప్పుడు? మీ అందాన్నిపోలి పుట్టడానికి పొద్దుచాలక పోయింది వాడికి. దీనికేం గాని, ఈ పార్టీకోసం ఇప్పుడు లాంకోటూ, జరీపాగా వగైరాలు ఎక్కడ సంపాదిస్తారు?

కిరీ:-గవర్నరుపార్టీ కెడుతో పూర్వకాలం ముసిలిఆఫీసరుకు మల్లే లాంకోటూ, పాగాపెట్టుకెడతానా? ఆలాంజ్ సూట్లోనేవెడతా.

సుం:-మీకుందా మరి?

కిరీ:-లేకపోతే కుట్టిస్తా.

సుం:-ఈ పార్టీకోసమని కుట్టిస్తే బోలెడైపోతుందేమో.

కిరీ:-పోతే పోతుంది. ఖర్చవుతుందని గవర్నరు పార్టీ మానుకుంటామంటే? ఓమాటు నాపేరు గవర్నరు జాబితాలో పడిందిగనుక ఇంక ముందు ముందు పార్టీలన్నింటికీ ఇన్విటేషన్లు వస్తూనేఉంటాయి.

కనుక ఓలాంజి సూటు నాకు శాశ్వతంగా ఉండడం అవసరం. డబ్బయితే అయింది మంచి ట్వీడ్డు చింపిస్తా. ఐతే నీదగ్గరేమైనా సొమ్ముందా?

సుం:-మావాళ్లు పట్టుచీర కొనుక్కోమని ఇచ్చిన 50 రూపాయిలు తప్ప ఏమీలేదు.

కిరీ:-నీకు వాయిదాలమీద తీర్చేస్తా. ఆసొమ్ము నాకు బదులియ్యి. నీ చీర కిప్పుడు తొందరేమిటి?

సుం:-(నానుస్తో) మీయిష్టం.

కిరీ:-నా దగ్గరో ముప్పై ఉన్నాయి. నీవియాభై, మొత్తం ఎనభైతో ఫస్టుక్లాస్ డ్రెస్సు వస్తుంది.

సుం:-ఈఖర్చు అవసరమో లేదో ఆలోచించుకు చెయ్యండి. ఉన్నది కాస్తా ఖర్చుచేసు కున్నామంటే రేపు చిక్కుపడతామేమో.

కిరీ:-నాన్సెన్సు, అవసరమైనప్పుడు డబ్బుకి మొహం చూసుకోకూడదు. ఇంక నాలుగురోజులే ఉంది పార్టీ. ఈవేళ ఆర్డరియ్యకపోతే ఆనాటికి సూటు రెడీఅవదు...ఏదీ, నీదగ్గర సొమ్మిలాతే.

సుం:-ఇదిగో తెస్తున్నా (పెట్టతీసినచప్పుడు) ఇదిగో.

కిరీ:-సరి. ఫేషనబుల్గా కుట్టడానికని యూరోపియన్ టెయిలరు కిస్తా. బూడ్సు, ఇతర హంగామాకొనడానికి టైమ్ పడుతుంది గనుక రాత్రి కొంచెం ఆలస్యంగావస్తా, వెడుతున్నా.

సుం:-సరి.

(ఒక 10 నిమిషాలయాక సుందరి తమ్ముడు నరసింహారావు తలుపుదగ్గర)

నరసింహా:-అక్కా! తలుపు.

సుం:-వచ్చె, వచ్చె. (తలుపులుతీసి) ఇవేమిటి? మొక్కజొన్నపొత్తులా, ఎక్కడివి?

నర:-మాయింటికి ఎవరో కోనేటిరావుగారట? ఆంధ్రా యూనివర్సిటీలో ప్రొఫెసరుట, ఆయనవచ్చాడు నిన్న. ఇక్కడసైన్సు కాంగ్రెస్సని ఓ మీటుంగవుతోందిలే. దానికోసంవస్తూ, ఆయన పట్టుకొచ్చారు ఈపొత్తులు.

సుం:-సైన్సు కాంగ్రెస్సుకా? గవర్నరేదో టీపార్టీ ఇస్తారట కాదు, వీళ్లందరికీ?

నర:-ఔనట! అందుకే కాబోలు ఈ కోనేటిరావుగారు 'నాకేమీ కవరురాలేదా? గవర్నరు టీపార్టీకి ఇన్విటేషను. ఈపాటికి వచ్చిఉండాలే'అని పదే పదే అన్నాడు. అమ్మ, కిరీటరావు బావకేదో కవరొచ్చిందనీ, అదితప్ప ఉత్తరాలే లేవనీ చెప్పింది. ఆకవరేదో మీకుపంపిందిటగా, ఎవరాశారు?

సుంద:-ఆకవర్లో గవర్నరు టీపార్టీ ఇన్విటేషనే వచ్చింది. (ఆలోచిస్తో) కొంపతీసి, ఆకవరు ఆకోనేటిరావు గారిది కాదుగదా? ఏదీ చూడు.

నర:-ఎక్కడుందీ కవరు? ఒహో, ఇదా? ఇది కోనేటిరావుగారికే వచ్చింది! అమ్మ కిరీటీరావు బావకే వచ్చిందనుకొని మీకు పంపినట్లుంది.

సుం:-ఎంతపొరపాటు జరిగిందో చూడు. ఆఇన్విటేషను తమకే అనుకొని మీబావ, అపార్టీకితగిన డ్రెస్సు కొనడంకోసం ఇంట్లోఉన్న సొమ్మంతా పుచ్చుకొని బజారుకెళ్లారు. తీరాఖర్చుచేసి ఇంటికొచ్చాటప్పటికీ ఆకవరు తమదికాదని తెలిసేక, ఇది మనంఅంతాకలసి ఆయన్ని అవమానపరచడంకోసం చేసిన ప్లాటని భావిస్తారు! అదేమిటోకాని, ఆయనకైనా అడ్రసు చూసుకోవాలని తోచిందికాదు.

# గానకళ

సంగీతోపాధ్యాయ
శ్రీ గాలి పెంచలనరసింహారావు

## హరికాంభోజిరాగము — రూపకతాళము

| | | |
|---|---|---|
| ఆరోహణ : | సరిగమపదనిస | స. రి. గ. మ. ప. ద. ని. స |
| అవరోహణ : | సనిదప మగరిస | ,, చ. అం. శు. ,, చ. కై. ,, |

సంపూర్ణ సంపూర్ణము

28-వ మేళకర్తయగు "హరికాంభోజి"

త్రేలికి నాలుగుఅక్షరముల చొప్పున ఘాతనుండి రెండు అక్షరములు త్రోసి పాడుకొనవలయును.

పల్లవి : పదునాల్గు భువనములకు - పతియౌ దైవం
పదునాల్గు భువనములకు - పతియౌ ఒకే దైవం
పదునాల్గు భువనములకు - పతియౌ ఎందైనా ఒకే దైవం॥ పదు॥

అనుపల్లవి : హృదయపీఠమందు జేర్చి - పదిలముగను భజనసేతున్॥ పదు॥

చరణము : ఉర్విలోని జీవకోటి - నుదరమందు నునచిబ్రోచు
సర్వరక్షకుండవయ్య - స్వామివనుచు నుతులనందు॥ పదు॥

| | | | | |
|---|---|---|---|---|
| పల్లవి. | , , : | పపదనిసా నిదపా | । | ,, మగగరి - పమగరిరిస |
| | : | పదునఅఆఅఅల్గు | । | ,, భువనఅ - ముఉలఅకుఉ |
| | , , : | గమమపా, ,,-,, ,, | । | ,, ,,-,, ,, - పదధప |
| | : | పతియౌఊ,-,,-,, ,, | । | ,,-,,- ,, ,, - దైఇవం |
| | మప : | పపదనిసారిస నిదపా | । | ,, మగగరి - పమగరిరిస |
| | ०० : | పదునఅఆఅఅ అఅల్గు | । | ,, భువనఅ - ముఉలఅకుఉ |
| | , , : | గమ మపా, ,,-,, ,, | । | ,, ,,-,, ,, - పదదప |
| | : | పతియౌఊ-,, ,, ,, | । | ,, ,,-,, ,, - దైఇవం |
| | మప : | పపదానీ దనిసా నిసరిసనిద | । | పామగగరి - పమగరిరిస |
| | ०० : | పదునఆఅఅఅఅఅఅఅఅ | । | ల్గుభువనఅ - ముఉలఅకుఉ |
| | , , : | గమ మపా, ,,-,, ,, | । | ,, ,,-,, ,, - సనిధప |
| | : | పతియౌఊ ,,-,, ,, | । | ,,-,,-,, ,, - ఒకెఎదై |
| | దమ : | పపదానీదనిసా ని సరి స నిద | । | పామగగరి - పమగరిరిస |
| | ఇవం : | పదునఆఅఅఆ అఅఅఅ అఅ | । | ల్గుభువనఅ - ముఉలఅకుఉ |
| | , , : | గమమపా, ,,-,, ,, | । | ,, సమగమ పా - సనిదప |
| | : | పతియౌఊ ,,-,, ,, | । | ,, ఎందైఇనన్ - ఒకెఎదై |
| | దమ : | పపధా, నిరిసనిద-నీసనిద | । | పా, మగగరి, పమగరిరిస |
| | ఇవం : | పదునా, అఅఅఅఅ-అఅఅఅ | । | ల్గు-భువనఅ, ముఉలఅకుఉ |
| | , , : | గమ మాదప మపా,-,, ,, | । | ,, ,,-,, ,,-,, ,, |

| | | | | |
|---|---|---|---|---|
| | | : | పతియాఉఉఉఊ-,, ,, | ,, ,,-,, ,,-,, ,, |
| అనుపల్లవి. | ,, | : | నినిదానీసాసా | నిసా, రీ - రిసనిదా, సా, |
| | | : | హృదయాపీఈశ | మందూజెఎఎఏర్చీ, |
| | ,, | : | నినిదానీసాసా | నిససారీ - రిసనిద దాసా |
| | | : | హృదయపిఈశ | మంందూ - జెఎఎఏర్చీ |
| | ,, | : | నినిదానీసాసా | నిసరి గమా - గామగరీసా |
| | | : | హృదయపిఈశ | మంంందూ - జేఎఎఏర్చీ |
| | ,, | : | సరి సనిదానీసా | నిసరి గమా గామగరీసా |
| | | : | హృదయఅపిఈశ | మంంందూజేఎఏర్చీ |
| | నిద | : | దరిరీ - నిదనిససా | పదదనిరిస - నిదపదపా |
| | పఅ | : | దిఇల - ముఉగఅనూ | భఅజఅనఅ - జెఎఎతూ |
| | నిద | : | దరిరీ - సనిదనిసా | పదదనిసా రిస నిద పాదప పమ |
| | పఅ | : | దిఇలా - ముఉగఅనూ | భఅజఅనాఅఅ, జెఎఏఎఎతున్ ‖ ప‖ |
| చరణము. | ,, | : | పాపా పాదపదా | దనిరిస సని - నిదదపపమ |
| | | : | ఉర్వీలోబబనీ | జీఇఇఇవఅ - కోఒఒఒటిఇ |
| | ,, | : | గగమా గరిగరిసా | ,, గమ మపపా - పా పాదని |
| | | : | నుదర మంందూ | ,, నుఉనఅచీ బ్రోచూఉఉ |
| | థమ | : | పాపా - పాదపదా | దానిరిసని - నిదదపపమ |
| | ఉఉ | : | ఉర్వి - లోబబనీ | జీఇఇవఅ - కోఒఒఒటిఇ |
| | ,, | : | గగమపమా గరిగరిసా | ,, గగమా - పదమపపా |
| | | : | నుదరఅఅ ముంంందూ | ,, నునచీ - బ్రోఒఒఒచూ |
| | ,, | : | పనిదా - దనిసాసా | సనిసారీ - రిసనిద దస |
| | | : | సఅర్వ - రఅఅక్ష | కంండ వఇఇయ్యాఉ |
| | ,, | : | పనిదా - దనిసాసా | నిసరిగమా - గామ గ రీ గ రి సా |
| | | : | సఅర్వ - రఅఅక్ష | కంంండ వఇఇఇఇఇయ్యా |
| | సని | : | దరిరీ - సనిదనిసా | పదదనిరిస - నిదపదపా |
| | స్వఅ | : | అఅమీ - వఅనుఉచూ | నుఉతుఉలఅ - నంందూ |
| | సని | : | దరిరీ - సనిదనిసా | పదదని దనిసా, నిసరి స నిదపా |
| | స్వఅ | : | అఅమీ - వఅనుఉచూ | నుఉతుఉలఅఅ - నంంంందూ |
| | థమ | : | పదునాల్గు భువనములకు పతియా | |
| | ఉఉ | : | | |

ముక్తాయిస్వరము.

| | | | |
|---|---|---|---|
| ,, | : | దనిదపామదపమగ | , రిగమపా, ధ, సనిదా |
| పమ | : | , గమపదా - నిస రి గ | మగసా, పా, సా, రి |
| గమ | : | పదునాల్గు భువనములకు పతియా | |

# ఖద్దరు : స్త్రీలు

జాతీయతకు జీవం, సాంఘికంగా సౌఖ్యప్రదం, ఆర్థికంగా ఆచరణీయం, గృహపరిశ్రమల్లో ప్రధానం, స్త్రీలపాలిటి పెన్నిధి ఖద్దరు పరిశ్రమ. కదురుతిరిగినా కద్యముతిరిగినా కరు వుండదన్నారు. దీన్ని గురించి ఇంకా తర్కించుకోవడం, చర్విత చర్వణంకాదూ ?

'సత్యంవద'

సాధారణంగా స్త్రీలు ఖద్దరన్నా, రాట్నము వడుకుటయన్నా, చాలా అనాగరికమైన మోటు పని అనీ, నాగరికస్త్రీలకు చేయదగనిపని అనీ ఉద్దేశ్యం కలిగివుంటారు. మొన్న నేను ఖద్దరు-చీర కట్టుకుని మా స్నేహితురాలు దగ్గరకు వెడితే ఆమె అంటుంది 'ఇదేమే, ఈ చీరలెల్లా కట్టుతున్నావే? ఇంత బరువు! మొన్న మావారు ఒకచీర తెచ్చారు ఎంతబాగుందో చూడు. రెండున్నర రూపాయల ఖరీదట; పల్చగా వుల్లి పొరలాఉంది; గంధపచెక్కలాగ మన్నుతుంది. ఈ గాంధీ-చీర ఏమిటే, తల్లీ! ఎప్పుడూ చూడలేదు; ఇదికట్టుకుంటే భూతకిలాగున్నావు'. నేనన్నానుకదా 'సరే నీకిది. భూతకిలాగే వుందికాని, నీవు కొన్నదే అసలైన భూతకి; మొన్న పోలెండును కబళించిన జర్మనీవాళ్లు తయారుచేసినవీ, చైనాను ధ్వంసం చేస్తూన్న జపానువాళ్లు పంపే మూడునోజులైనా మన్నని సిల్కులూ, చక్కగా సుఖప్రదంగా వుంటాయి నీకు. ఇక్కడేమో, మనయింటిప్రక్కని తిండిలేక చస్తోన్న ముసలమ్మలూ, వాళ్ల సంసారాలు నీ కళ్లకు గోచరించనే గోచరించవు. ఎందుకు? రోజూ పత్రికలుచదివి ఏంలాభం?' అని. ఆమెకు కోపంవచ్చినా సరే నా ఆవేశం ఆగిందికాదు.

ఖద్దరుకట్టుగుని నూలు తీసుకుంటూ, మన ముద్దుపాపలు ఏకులు చుట్టుతూ ఉంటే జీవితం ఎంత ప్రశాంతంగా ఉంటుంది! ఒకరిని కష్టపెట్టుడం వుండదు. ఇతరులకు ఈ జీవితము ఆదర్శప్రాయమై దేశమంతా ఎవరిశక్తి మీద వారు ఆధారపడే స్థితికి వస్తుంది. అప్పుడు అనవసరముగా హింసలు జరుగవు. జపాను సిల్కులూ, గ్లాస్కో, మల్లులూకొని మనలను అణగద్రొక్కి నాశనంచెయ్య దలుచుకున్న వాళ్ల కేశ్రమలేకుండా డబ్బు పంపిస్తున్నాము. ఎంత అన్యాయము! ఒకబట్టలేకాదు, సమస్తమూ ఇతరదేశాలవే. జడపిన్నులూ, రిబ్బనులూ, డియమ్నాసారాలు, పూలూ, అన్నీనూ; మనదేశంలో తయారుచేసుకోలేమా! అన్ని పరిశ్రమలూ మనమే మనదేశంలో అభివృద్ధి చేసుకోవచ్చు. కొనేజనులు వుంటేనేకాని ఏ పరిశ్రమ అభివృద్ధి పొందదు. మనదేశంలో తిండిలేని వారెంతోమంది వున్నారు. అల్లాంటి సమయంలో మన ధనమంతా ఇతరదేశాలకు ప్రవహింపజేయడం ఏం న్యాయం? మనపిల్లలు కొందరు తిండిలేక ఏడుస్తూ కడుపు కొట్టుకుంటూంటే, మనం సహించగలమా? ద్రోహం. ఆలోచిస్తే ప్రతీతల్లికీ ఇదెంత దుర్భరమో తెలియక తీరదు.

అఖిలభారత చరఖాసంఘంవారు మనదేశంలో అన్నిచోట్లా శాఖలు ఏర్పరచుకొని, న్యాయమైన కూలియిచ్చి ఏకులుచేయించి, నూలువడికించి, బట్టలు నేయించుతున్నారు. వీటిలో రకరకాలచీరలు వస్తున్నాయి. కొనేవారి ప్రోత్సాహమునుబట్టి ఉంటుంది వీటి ఆధిక్యత. ఇన్ని రకాలూ చేతిమీద మన

సోదరులు తయారు చేస్తూండగా, వాళ్లను పొమ్మని త్రోసివేసి, మనస్వార్థమే చూచుకొని, కాస్త తక్కువ ధరకదా అని, యితరదేశపు బట్టలు కొనగలగడం కేవలము ఆత్మవంచనకాదూ? ప్రోత్సాహము ఉండి, పరిశ్రమ అభివృద్ధి అవుతూన్నకొద్దీ, అన్ని నాజూకులు ఈ బట్టలలోనూ, వస్తువులలోనూ తేవచ్చు. ధరలు కూడా రానురాను తగ్గుతాయి.

లేనివాళ్లూ, ఉన్నవాళ్లూ తప్పక ఖద్దరే కట్టాలి. 'ఖద్దరు ఖరీదును భరింపలేనివాళ్లు ఖద్దరువస్త్రములు ధరించుట ఎట్లాగ?' అనే ప్రశ్న రావచ్చును. చక్కగా ప్రత్తి పండించుకొని, లేక పల్లెటూళ్లలో కొనుక్కొని, స్వంతంగా ఏకులు తయారుచేసుకొనవచ్చును. ఈ పద్ధతి యిదివరలో పత్రికలలో ప్రకటించబడినది. ఆ యేకులతో ప్రతిదినమూ రాట్నముమీద కాని, తకిలీమీదకాని ఒకగంటసేపు నూలు తీయవచ్చును. బాతాఖానీ కబుర్లసమయంలో ఈపని సులభముగా చెయ్యవచ్చును. రోజునకు ఒకగంట రాట్నముమీద దారం తీసినట్లయితే 200 గజములు నూలు సులభముగా తీయుటకు ఒకనెలలో అలవాటు పడుతుంది. ఇల్లాగ సంవత్సరం పొడుగునాచేస్తే, ఎవరికి సరిపడ్డబట్టలు వాళ్లు నిరాఘాటంగా నేయించుకొనవచ్చును.

ఏండ్లునిండిన ముసలి స్త్రీలుకూడా కాలుకదుప నక్కరలేకుండా తమ జీవితమునకు సరిపడ్డ ధనమును ప్రతీ సంవత్సరం సంపాదించుకొనగలుగుచున్నారు. ఇంకేపనిఅయినా వీరికి తిండిపెట్టగలదా? క్షామములు పట్టినప్పుడు ఈ ఖద్దరు ఉద్యమమే రక్షణోపాయమవుతోంది వేలకువేలు జనులకు. బాల్టిక్ రాజ్యాల చరిత్రలు చదివితే, వారి గృహపరిశ్రమలు వారిని ఎట్లు రక్షిస్తున్నాయో తెలియగలదు. గాంధీమహాత్ముడు హిందూదేశములోని పల్లెలసత్తా తెలుసుకొని, తన జీవితంలో ఖద్దరునకు మొదటిస్థానం ఇచ్చాడు. "రాట్నమే నాజపమాల" అంటాడు 'రాట్నసేవయే ఈశ్వరసేవ'ట. ఈ ఖద్దరు మానవజీవన విధానమునందుకూడా ఒక నూతన ధర్మమును వ్యక్తముచేస్తోంది. భారతదేశానికిది మోక్షసాధనము; నిరాడంబరజీవికి బాహ్యచిహ్నము; అహింసాసిద్ధికి ముఖ్యసాధనము; గృహపరిశ్రమలలో నగ్రగణ్యము. ఇది పేదలపాలిటి కామధేనువు. విదేశములకు పోయే స్వర్ణవాహినిని ఆపగలిగే ఆనకట్టు. ఎండకన్నెరుగని మానవతులైన స్త్రీలకు గౌరవ జీవనాన్నిచ్చే అపూర్వసాధనము; అనాధలకు శరణ్యము. జీవనముకై ముష్టియెత్తుకొనడాన్ని తొలగిస్తుంది. భారతజాతీయైక్యతకు సాధనము. ఖద్దరు పరిశ్రమ స్త్రీలసొత్తు. ప్రతిస్త్రీ రోజులో కొన్నిగంటలు వృధాగా కాలక్షేపం చేస్తూనేఉంటుంది. అటువంటి సమయాల్లో నూలు తియ్యడం ఒకనిత్య ధర్మంక్రింద పెట్టుకుంటే ఆమె సంసారానికి కావలసిన బట్టలు తయారుచేయగలుగుతుంది. ఇటువంటి ఉత్తమ కార్యాన్ని కేవలం 'మోటు'క్రింద కట్టివేయడమువల్ల నాజూకుపేరుచెప్పి మనమే మోసపోతున్నాము గాని వేరుగాదు.

## కర్షకా!

జీవులకు అన్నదానంబుజేయు నీవు అష్టకష్టములన్నియు నట్టెమరచి
కండలను కరగించియు కష్టపడియు కర్షకా! యేమిటోయి నిర్ఘాంత పడెదు!
కళ్లు లొట్టలుపోయియు, కడుపు లంటుకొనియు ఎండుముఖాలతో కాళ్లకడ్డు
బడెడి దీనవదనముల బిడ్డల కని కర్షకా! యేమిటోయి నిర్ఘాంత పడెదు.
మంచిరోజులు గాంచెదం మనము ఇట్లు ఇంకనెన్ని దినంబులు ఈ ఇడుములు
నీదుశక్తి జూపన్ లెమ్ము నిద్రనుండి కర్షకా! యేమిటోయి నిర్ఘాంత పడెదు!

—శ్రీమతి ఈడ్పుగంటి పుష్పావతి

## కొవ్వూరు హిందీబాలికా పాఠశాల బాలికలు



కుమారి
శివుడు సుబ్బలక్ష్మి
'ధన్ దాస్' అను హిందీ నాటకమున పాల్గొని రజిత పతకమును బడసినది.

కుమారి
జాజాల పార్వతి
హిందీ వక్తృత్వ పోటీ పరీక్షలో ప్రథమ బహుమతిగా నొక రజిత పతకమును బడసినది.





'మూడేళ్ల ముద్దుబాలుడు -
బాలికా వేషమున'







'చిరునవ్వు'

శ్రీ బండి రామారావు

# సనాథా? అనాథా?



నిర్మల మలయ మారుతంలో తేలియాడ వలసిన నిర్మల జీవితం వృద్ధ వివాహపు సుడిగాలిలో చిక్కుకుని శిథిలమై పోయింది...

సనాథమైన ఆమె అనాథ జీవితానికి మరి జీవన జ్యోతి లేదూ...

'ఆహా ప్రపంచమా' అంటూ కూలబడింది నిర్మల. కండ్లవెంబడి నీళ్లుకారడం ప్రారంభించాయి. నిన్న మొన్నటికోడలు. ఆమెకిటువంటి సంతాపమా? చిన్నప్పటినుండి నేటివరకు తలితండ్రుల ప్రేమలో గడిచాయి రోజులు. ఏకాంతవాసం యేర్పాటుచేసుకుంది. చిన్ననాటి స్నేహప్రవాహము ప్రవహించింది. ఇప్పుడు చిన్నప్పటి చెలికత్తెలను పోగొట్టుకుంది. ఆ నిర్మల నేడు మరోప్రపంచంలోకి నెట్టుకురాబడింది. అయితే సంతాపమెందుకుండదు? ప్రపంచమంతా ఆమెకు క్రొత్త. కొన్నిరోజులకుగాని యీ ప్రపంచానికి అలవాటుపడదు. తన్నుతాను తెలుసుకోలేకపోతోంది నిర్మల. జీవితపర్యంతం తాను ఎట్లాగడపాలో ఆలోచనకు రాలేదు. రేపే ఆమె పాపపరిహారం జరుగుతుంది. అపుడామెకు సంతాపానికి బదులు స్వాభావిక ఆనందంవస్తుంది. జీవితవిలువకూడ తెలుస్తుంది. ఆమె భవిష్యత్తు అంధకారమయం. నిర్మల పుట్టి పెరిగిందన్నమాటే గాని వ్యవహారజ్ఞానం శూన్యం. తనభవిష్యత్తును కళ్లారా చూచింది. ఏమిటి? ఘోర అంధకారం. ముళ్లడొంక. అడుగడుగునకు ఆపదలు. ఆపదలనుండి ముక్తిమార్గమేదీ కనబడలేదు. ఆమె ఆకాశమందు వెలుగులేని కిరణాలున్నాయి. పెద్దజ్వాల ఆమె కోమలహృదయంలో బయలుదేరింది. మనసుమాత్రం నిలకడలేదు. ఆమె తలితండ్రులే రక్షణకుబదులు కందకం త్రవ్వారు. పాపం నిర్మలకు సహాయంలేదు. చాల బాధపడుతూంది. ఏంచెయ్యాలి?...

ఆమె కొద్దిరోజులక్రితమే యీ యింట్లో పాదంపెట్టింది. ఇంటివద్ద స్నేహితురాండ్రు 'నిర్మల అత్తవారింటికెళితే యీవిధంగా ఉంటుందా? మనల్ని మరచిపోతుంది. మరల తిరిగివస్తే మనలను సరిగా చూడదు, సరిగా మాటాడదు, విసుక్కుంటుంది.' అని వేళాకోళం చేసేవారు.

నిర్మలవచ్చి రెండువారాలు గడచిపోయింది. తనపుట్టింటి గొడవలు మరచిపోయింది. కాని మనసు బాధిస్తూనే వుంది. మనోవేదన క్రమంగా మించింది. అయితే ఏమి? ఆమె కేవలం స్త్రీ ఆమెనోరు మెదిపితే సమాజం వేయికండ్లతో చూస్తూవుంటుంది. తనభాగ్యరేఖ ఆపదలతో పోరాడ్డానికి సిద్ధపడింది. గొప్పమార్పు వచ్చింది ఆమె జీవితంలో. ఆమె హృదయం కోమలం, కాని రాయైంది. స్త్రీ కంఠం మృదువు, కాని కటువయింది. ముఖాన కోపజ్వాల చెలరేగింది. ఎవరికోరకు? ఆమెకిదంతా తెలియదు. ప్రపంచమంటేనే ఆమె కసహ్యమయింది.

సంధ్యవేళ. నక్షత్రాలు ప్రకాశించాయి. గదిలో వంటరిగా చింతతోకూర్చుంది నిర్మల. ఆమె చింతఅనే చితిలోపడి మండిపోతుంది రాత్రింబవళ్లు. అదేదోగొప్పదే అయిఉంటుంది ఆమెనెవరో పిలిచారు. గుండెకొట్టుకుంది వేగంగా. శరీరం గగుర్పాటుచెందింది. అకస్మాత్తుగా కళ్లనీళ్లుకారాయి.

'నిర్మలా నీవు సాధర్మపత్నివి; నాకుశక్తిలేదు; నీవు కోపముచెంద నవుసరంలేదు. నీవులేకుండా భగవంతునిపూజ కాజాలదు. నేను భర్తను కాని అసమర్థుడను; నాకోరకు నిన్ను పెండ్లాడలేదు; భగవంతుని పూజలు బాగాజరుగుటకు చేసుకున్నాను' అని ఎవరోచెప్పినమాటలు ఆమె బాగావింది.

'ఒంటరిగా నేను దేవాలయానికి వెళ్లలేను' అంది నిర్మల ఏడుస్తూ.

'గురుదేవు డున్నాడు.'

'ఉన్నా సరే, నేనుపోలేను.'

'నీకువెళ్లుటకు భయముచేస్తే మనిషిని పంపిస్తా'నని కాళీచరణబాబు నౌకరును పిలిచి వెళ్లమని బలవంతపెట్టాడు. నిర్మల పెద్దనిట్టూర్పువిడిచింది. ఆజ్ఞ తిరస్కరించటానికి ప్రయత్నించింది, కాని అది సాధ్యమా? ఆమె పూజ ప్రారంభించింది, స్నానంచేసి పూలతోసహా మందిరానికి పోతూంది రోజూ.

దినములుగడచిన కొలది ఆపదలువస్తున్నాయి. ఎల్లపుడు ఆమె సతీత్వం చెడగొట్టటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. తన్ను వెంటాడే కాముకులనుగురించి పతిదేవుతో మొరపెట్టుకుంది. కాని లాభం లేదు. ఏమీచేతకానపుడేమిచేస్తుంది? వెక్కివెక్కి ఏడ్చింది.

ఆనాడు శ్రావణపూర్ణిమ. మందిర పూజారివచ్చాడు. 'నేడుమంచితిథి. యీరోజున మీభార్య ఉపవాసదీక్షతో పూజసల్పిన పుత్రుడు జన్మించును. రాత్రంతా అక్కడేఉండాలి'అని కాళీచరణబాబుకు చెప్పాడు. సంధ్యాసమయం. దేవాలయపు గడియారంమ్రోగింది. పతివ్రత, భారతనారి భర్తసేవకు హాజరైంది. ఆమాటలన్ని నిర్మలకు చెప్పాడు, కాని ఆమె సందేహించింది. విధిలేక మందిరమువైపు ప్రయాణంకట్టింది. కండ్లవెంబడి నీళ్లు కారుతున్నాయి, కాని ఆవిడ సంతోషానికి అంతులేదు.

నిర్మల నటుపంపి కాళీచరణబాబు సంతానంఅనే ఆశలోమునిగి రాత్రిగడిపాడు. 5 గంటలయింది. దేవాలయపు తలుపులు తెరువబడలేదు. ఆలస్యం అయినకొలదీ 'నిర్మలవ్రతం ఫలించింది. రాత్రంతా మేల్కొనడంచేత యింకాలేవలేదు. గురుదేవ్‌కూడ యింకా మేల్కొనలేదు.' అని ఆలోచిస్తూన్నాడు కాళీచరణ్. యింతలో 8 అయింది. నౌకరునిపిలిచాడు, కాని జాడలేదు. మరుక్షణంలో 5, 6 పోలీసులు 'మీరేనా కాళీచరణబాబు? మీభార్యయేనా నిర్మల?' అంటూవచ్చారు. పోలీసు యినస్పెక్టరు 'మీరు మూడు ఖూనీలకు బాధ్యులైయున్నారు, మీ భార్యవ్రాసిన పత్రమిదిగో' నని జాబు చేతికిచ్చాడు. దానితోబాటు సంకెళ్లుకూడ తగిలించారు. తన భార్యవ్రాసిన పత్రాన్ని కాళీచరణబాబు యీవిధంగా చదువనారంభించాడు. 'సోదరులారా! నేను సనాథనైనా అనాథనైపోయాను. నాపతి కడువృద్ధుడు. 55 వ సం॥లో ఆయన నన్ను వివాహమాడారు. నేను వారిధర్మపత్నిని నన్నువారు అమర్యాదగా చూచారు. సంతానాపేక్షతో మందిరానికి పంపారు. అచట నా పాతివ్రత్యానికి భంగం గలుగపోయింది. దానిరక్షణ నిమిత్తం నేను స్వయంగా రెండు ప్రాణాలుతీసాను; నా ప్రాణంకూడ సమర్పించాను' చదువుతూ చదువుతూ బాబుకు కళ్లు మూతలుపడ్డాయి. ఇనస్పెక్టరును చూస్తూ చూస్తూ పక్కమీద కూలబడ్డాడు. వైద్యునితో నిమిత్తం లేకుండానే అతని ప్రాణాలుకూడా ఎగిరిపోయాయి.

(అనువాదం)

★ స్త్రీలు

## రైలు ప్రయాణము

రైలుప్రయాణము - ఇదొకటి - పెద్ద చరిత్రగల సాంఘిక దుర్వ్యవస్థ. ఇందు స్త్రీలవిషయమై జరుగుచున్న అసౌకర్యములు, అగచాట్లు చెప్పనలవిగాదు. ఇందుకు స్త్రీ సంఘములు తగిన అందోళన జరిపినగాని ఇది చక్కబడదు.

రైల్వే ప్రయాణమును గురించి ప్రతి ఒక్కరు శ్రద్ధతీసుకొనుచున్నారు. ఎందుకన రైల్వేలలో ప్రయాణీకులకు గలుగుచున్న అసౌకర్యములే కారణము. ఇందులకుగాను భారతదేశములో ప్రయాణీకుల సంఘములు స్థాపింపబడి ప్రయాణీకులకు సౌకర్యముల కలుగజేయుటకుగాను కృషిచేయుచున్నవి. తెలుగు వారికి సేవచేయుటకుగాను బెజవాడలో 'ఆంధ్రదేశ రైల్వు ప్రయాణీకుల సంఘము' స్థాపింపబడి సొసైటీల అక్టుక్రింద రిజిష్టరు చేయబడినది. ఆంధ్ర సంఘమునకు ఆధీనమైన జిల్లా సంఘములు, తాలూకా సంఘములు కూడా కృషిచేయుచున్నవి.

రైల్వేలలో స్త్రీలు స్వతంత్రముగా ప్రయాణము చేయుటగలదు. కాని వారి ప్రయాణములో రైళ్లలో, స్టేషనులందు అనేక అసౌకర్యములు కలుగుచున్నవి. కాని అవి పూర్తిగా వెల్లడి అగుటలేదు. ఇందులకు కారణము మన అశ్రద్ధ అని చెప్పకతప్పదు. 1927 సం|| నుంచి ఆంధ్రసంఘము కృషిచేయు చున్నప్పటికి యింతవరకు స్త్రీలనుండి ఒకరిపోర్టుకూడా రాలేదు. కాని ఈమధ్య శ్రీమతి రాధాబాయమ్మ గారు సెంట్రల్ అసంబ్లి సభ్యురాలైన పిదప స్త్రీల విషయములలో ప్రశ్నలు వేసిరి. మిస్ట్రిస్ సులోచన బాయి పారడకర్ గారు ' స్త్రీ ప్రయాణీకులకు జాగ్రత ' గురించి రైల్వేబోర్డువారితో ఉత్తర ప్రత్యుత్తరముల జరిపియున్నారు.

ఆంధ్రదేశములో స్త్రీలకు కలుగుచున్న అసౌకర్యములను తెలుసుకొని వాటిని నివారణచేయ ప్రయత్నములు జరుగుటలేదు. ప్రతిస్టేషనుయందు టికట్లుతీసుకొను స్థలమున పురుషులతోకలిసి తీసుకొను నప్పుడు, గేటుదాటి వెళ్లునప్పుడు టిక్కెట్టుకలెక్టర్లవల్ల కలుగు ఇబ్బందులు, ఈరైలువద్ద స్త్రీలబండి ఎచటనున్నదో కనుగొనునప్పుడు, రైలునెక్కి స్థలములేక క్రిక్కిరిసియుండ నిలచుండుట వగైరా అనేక అసౌకర్యములు నిత్యము స్త్రీలు అనుభవించుచు వీటిని స్త్రీలకున్న సహజమైన ఓర్పుతో యిముడ్చుకొను చున్నారు కాని బయలు పరచుటలేదు.

జనసమర్దన మెక్కువయున్నట్టి బెజవాడవంటి స్టేషనులో ప్రత్యేకముగా స్త్రీలకు టిక్కెట్లు వేరుగా అమ్మించుట, ప్రత్యేక గేటులు ఏర్పరుచుట, ఏముప్పదిమంది ప్రయాణీకులకే సరిపోవుబండ్లనుగాక యింకను ఎక్కువమంది సౌకర్యముగా కూర్చుండుటకు వీలగుబండ్లను తగిలించి, ఆబండిమీద పెద్ద అక్షర ములతో ' స్త్రీలకొరకు మాత్రము ' అని వ్రాయించుట చాల అవసరమైన విషయములై యున్నవి. స్త్రీల బండ్లలో చంటిపిల్లలకు ఉయ్యాలలు ఏర్పరచుటకూడ అవసరము.

గేట్లవద్ద టిక్కెట్టుకలక్టర్లు స్త్రీలను చేతులనడ్డగించి అపుట నిత్యము కళ్ళార చూచుచూ మిన్నకుండుట శోచనీయము. పురుషులుకూడా యిట్టిస్థితిలో తమస్త్రీలు కారుకదా అని భావించి చూచుచుండుట భావ్యముకాదు. ప్లాటుఫారంమీద సరకులమ్ము కుఱ్ఱవాళ్లు ప్రవర్తించునట్టి నడతలుకూడా విమర్శించదగిన వనేకముగలవు. రైళ్లలో పుస్తకములు అమ్మువారు 'నామగడె నీమొగుడు ఒకఅణా' అని పెద్దగా కేకలువేయుచూ అమ్ముట, మొదలైన అవినీతి ప్రసంగములు స్త్రీలువినుచూ చూచుచూ సిగ్గుతో భరించుట, పురుషులు ఆనందించుట మొదలగు అవినీతి ప్రవర్తనలు రైళ్లలో జరుగుచునే యున్నవి.

యం. యస్. యం. రైల్వేలో స్త్రీలకు ప్రత్యేక ప్రయాణీకులశాలలు ఏకొద్దిగానో యున్నప్పటికి వాటిని స్త్రీలు ఉపయోగించుటలేదు. ఒకవేళ ఉపయోగించిన టికెట్టుకలెక్టరువచ్చి మీటిక్కెట్లు ఏవి అని అడిగి, 'మీదేవూరు? ఆ వూరు ఎక్కడ? మీరు ఈవూరు ఎందుకువచ్చారు' అని అతని కనవసరమైన ప్రశ్నలు వేయుచుండును. (ఇట్టిది బెజవాడలో జరుగగా రిపోర్టుచేయబడి తగుచర్య తీసుకొనబడినది.) గార్డుల విశ్రాంతి గదులలోకి స్త్రీలను తీసుకొనివచ్చి అవమానించిన విషయములు పత్రికలలో చదువుచునే యున్నాము. స్త్రీల క్యారేజిని ఒకదినమున ఇంజనుదగ్గిర, మరొకదినమున గార్డుపెట్టిప్రక్కన యుంచుదురు.

ఇట్టివి అనేక అసౌకర్యములు జరుగుచునే యున్నవని తలంచవచ్చును. వీటిని నివారణచేయుటకు స్త్రీలుకూడా శ్రద్ధ వహించవలయునని వేరుగా వ్రాయ నవసరములేదు.

ఆంధ్రదేశ రైలుప్రయాణీకుల సంఘములో ప్రత్యేకముగా స్త్రీలకు సౌకర్యములు కలుగజేయుటకుగాను 'స్త్రీశాఖ'ను ఏర్పరచ తలంచితిమి. విద్యావంతులైన స్త్రీలెల్లరు ఈ శాఖయందుజేరి వారితోటి సోదరీమణులకు సేవచేయ మిక్కిలిగా ప్రార్థించుచున్నాను.

నిత్యము ఖర్చుచేయుదానిలో ఎంతో విలువలేనట్టి రెండుఅణాలు మాత్రము సంవత్సరచందాగానిచ్చి ఆంధ్రదేశ రైలుప్రయాణీకుల సంఘమున సభ్యులుగాజేరి స్త్రీశాఖను వృద్ధిలోకి తీసికొనిరాగలందులకు సోదరీమణులెల్లరని మిక్కిలిగా ప్రార్థించుచున్నాను. ఈ సంఘమునకు యం. యస్. యం. రైల్వే అడ్వాయిజరీ కమిటిలో ప్రాతినిధ్యముగలదు. ఈ ప్రాతినిధ్యమునకు నన్ను సభ్యునిగా ఎన్నుకొనిరి. కావున ప్రయాణములో కలుగుచున్న అసౌకర్యములను, అవసరమగు సౌకర్యములను నాకు తెలుపగోరుచున్నాను. 'సూర్యదేవర సంజీవరాయణం, ప్రధానకార్యదర్శి, ఆంధ్రదేశ రైలు ప్రయాణీకుల సంఘం, తుమ్మపూడి పోష్టు, గుంటూరు జిల్లా,' అని వ్రాసిన నాకు వర్తమానములు తెలియగలవు.

—శ్రీ సూర్యదేవర సంజీవరాయణం.

# "తేఁటి నాతో నింక మాటాడవేమి?"

నీగాన కలిమిచే రాగాంధమైన యారామ కుసుమముల నారాటపెట్టి
దూరానపోయెదు దొంగవాఁడట్లు లీలోన మఱిచూడ వాలోలవిరిని.
అలరు తేనియలాని యలసినావేమొ? విరిపరాగమ్ముల విశ్రమించితివో?
తేనెకాలువలందు తేలియాడితివా? తేఁటి నాతో నింక మాటాడవేమి?
ఆశలుడిగిన యట్టి యతివరునివోలె నదినిదాటిన పాంధనరుని చందాన
ప్రకృతిలో లీనమై పాటమానితివా తేఁటి నాతో నింక మాటాడవేమి?

—ఉభయభాషాప్రవీణ, శ్రీ వేదవల్లి తాయారమ్మ.




## బొమ్మల పెండ్లి

శ్రీ అంకాల సత్యవతిక్కు.

శలవుదినాల్లో మాస్నేహితులు మా యింటికి రావడం, వాళ్లయింట్లకు మేముపోవటం అలవాటు. ఒక ఆదివారంరోజున మాస్నేహితురాండ్రు వనజ, పంకజం ప్రొద్దున్నే వచ్చారు. మేమందరం ఒకచోట కూర్చుని ఏవో గొడవలు చెప్పుకుంటూవున్నాం. అప్పుడు మాచిన్నచెల్లెలు లలిత లోపలనుండివచ్చి 'అక్కయ్యా బొమ్మల పెండ్లి చెయ్యవూ' అని అడిగింది. ఆమాటవినగానే మాకందరికి గత శెలవల్లో చేసిన బొమ్మల పెండ్లి జ్ఞాపకానికి వచ్చింది. మళ్లీ ఆలాటిది చెయ్యాలని వుత్సాహము కలిగింది. అందరం చేద్దాం అంటే చేద్దాం అనుకొని రాబోయే అదివారంనాటికి ముహూర్తం యేర్పాటుచేసాం. ఆరోజునుంచీ బొమ్మలకు చీరెలు, రవికెలు, మంగళసూత్రాలు, పూసలతో నగలు మొదలైనవి అన్నీ తయారుచేసికొని శలవుదినం కోసరం యెదురుచూస్తూ వున్నాం.

వనజ, పంకజం ఒక బొమ్మకు శృంగారంచేసి తక్కిన స్నేహితులతోకూడి ఆదివారం ప్రొద్దున్నే వచ్చారు. మా చెల్లెలు శశి పెండ్లికొడుకువాళ్లకు చేయవలసిన మర్యాదలుచేసి లోనికి తీసికొనిపోయి ఒక చోట కూర్చోపెట్టింది. అంతలో మా తమ్ముడు మోహన్ వచ్చి 'అక్కా నేను పెండ్లికొడుకువాళ్లతో వుంటాను' అని అడిగినాడు. అట్లాగేవుండమని చెప్పి పంపేశాం.

అందరంకలసి వంటలుచేసికొన్నాం. తరువాత పెండ్లి ప్రారంభించపోయాం. బ్రాహ్మడు కావలసివచ్చాడు. మోహనును అడిగాం. వాడువొప్పుకొని కొంచెంసేపట్లో బ్రాహ్మడుగా తయారై వచ్చాడు. పెండ్లి మొదలుపెట్టాం. బ్రాహ్మణుడు మంత్రాలేవో చెప్పేశాడు. ముందు కట్నం చదివించమని అడిగింది పంకజం. నాలుగుదమ్మిడీలు తెచ్చి పళ్లెంలో వెయ్యబోయాను. 'అట్లా వల్లపడదు యిస్తానన్న ప్రకారం యివ్వవలసినదే'నని పట్టుపట్టింది జయ. చివరకు ఆరుదమ్మిడీలు వేస్తేనేగాని వూరుకోలేదు. కట్నం నగలు చాలా తక్కువయిచ్చారని, బట్టలు సరియైనవి పెట్టలేదని, పెండ్లికొడుకువారు వాళ్లవిధప్రకారం వాళ్లు గల్లంతు చేసారు.

పెండ్లి అయిపోయే సమయంలో పేరంటాండ్రకు కుంకుమబొట్టు తాంబూలాలు యిస్తూ యెవరి పనిమీద వాళ్లువెళ్లాం. తిరిగి వచ్చేటప్పటికి పళ్లెంలో వేసినకట్నంలో రెండుదమ్మిడీలు తగ్గాయి. బ్రాహ్మడు

మీద అనుమానం వేసింది. వాడిని అడిగితే లేదంటే లేదన్నాడు. చివరకు వాడి పైతుండుగుడ్డను లాగిచూచాం. దాంట్లో రెండుదమ్మిడీలు వున్నాయి. బ్రాహ్మడికి యివ్వవలసిన కట్నం వొకదమ్మిడీ వాడికిచ్చాం.

పెండ్లయింది. భోజనాలవేళ కావటంచేత వడ్డించే యేర్పాటులో వున్నాం, ఈసమయంలో మోహన్ యెవరికి తెలియకుండా వంటయింట్లోకి వెళ్లిచూచాడు. గారెలు వాడికంటబడ్డాయి. వాడికి గారెలంటే యిష్టం. అందుచేత రెండుగారెలుతీసుకు తినేశాడు. వాడు చేసినపనికి నాకు పట్టరాని కోపంవచ్చింది. నాన్నగారితో యీసంగతిచెప్పి కొట్టిస్తేనేగాని వీడికి బుద్ధిరాదని అనుకున్నాం. భోజనాలు అయినతరువాత మాస్నేహితులు యెవరియిండ్లకు వాళ్లు వెళ్లిపోయారు.

సాయంత్రం నాయనగారు ఆఫీసునుండి రావడంతోనే మోహన్ చేసిన వాటినిగురించి చెప్పాం. యికమీదట దొంగపనులు చేయకుండా బుద్ధిచెప్పాలని వాడిని పిలిచి నాయనగారు రెండుదెబ్బలు కొట్టారు.

## పాతపాటలు

సీమ మిరపకాయ చిర్రోబుర్రో!
షాతగుడ్డచిరిగితే పుర్రోపుర్రో!
దానిమొగుడు దాన్నికొడితే మొర్రోమొర్రో!

సూరే గుమ్మిడికాయ
సుబ్బమ్మ తలకాయ
నార దబ్బకాయ
నారమ్మ తలకాయ

విశాఖపట్నం పిసెడిబెల్లం
నీకోపదలం నాకోపదలం

కళింగపట్నం కాసులపేరు
నీకోపేరు నాకోపేరు

భీముడిపట్నం బిందెలజోడు
నీకోజోడా నాకోజోడా

చెన్నపట్నం చెఱుకుముక్క
నీకోముక్క నాకోముక్క

బిందెనిండా కందులూ!
రంగసాని బొందులూ!!

వాసాలమీదదే మీసాలఎలుక
చిట్టెమ్మచేతిదే రత్నాలగిలక
రత్నాలగిలకికి మూడువంకల్లూ
వజ్రాలుతాపింత్రు వారిమామల్లూ?

ఆటమాణిక్యమే పాటమాణిక్యం
నట్టింటరాఘవ రత్నమాణిక్యం!
రత్నమాణిక్యమ్మ ఎవ్వారిపట్టి!
రాజుల్లచెలికాడు రావన్నపట్టి!!

—శ్రీ శ్రీనివాసాచార్య.

# గ్రంథ సమీక్ష

## శ్రీ మహారాజ విక్రమదేవవర్మ రచనలు

ప్రకాశకులు : శ్రీ తలిసెట్టి రామారావుగారు, మానేజరు, హుజూరు ఆఫీసు, జయపురం.

శ్రీ జయపురాధీశులును, సాహిత్య సామ్రాట్టులును అగు శ్రీ శ్రీ విక్రమదేవవర్మ మహారాజులుంగారు రచించిన ఖండకవితలు, కథలు, ఉపన్యాసాలు చేర్చి పుస్తకరూపాన్ని ప్రకటించారు ప్రకాశకులు. శ్రీ మహారాజుగారి కవితాప్రసక్తి ఆంధ్రమహాశయులకు క్రొత్తగాదు. వారి రచనలనన్నిటిని చేర్చి ఇట్లు పుస్తకరూపంగా వెలువరించడం మిక్కిలి సమంజసంగా ఉన్నది.

## ఆకలి మంటలు

కర్త : కీ|| శే|| కామ్రేడ్ శెట్టిపల్లి. ప్రకాశకులు : రైతాంగ గ్రంథమాల, గుడివాడ. వెల 8 అ.

కార్మిక, కర్షకవర్గముయొక్క దైన్యస్థితి, వారుపడే పలువిధములైన బాధలు, జరిగిన కొన్ని ఘట్టాలతో ఇందు చిత్రింపబడ్డాయి. హృదయవిదారకమైన యీ స్థితిని నిర్మూలం చెయ్యడానికి, వుద్యమాన్ని బలవంతంచేయడానికి ఇందులో చాలా విషయముంది.

## శెట్టిపల్లి గీతాలు

సంపాదకులు : శ్రీ ఆచార్య రంగాగారు. ప్రకాశకులు : ఆంధ్ర రైతాంగ గ్రంథమాల, గుడివాడ. వెల 2 అణాలు.

భావగర్భితమై, ప్రజలలో విప్లవాన్ని రేకెత్తించగల రచన శెట్టిపల్లిది. ఈ గీతాల వాడి ఇదివరకే చవిచూచింది ఆంధ్రదేశం. ఆ గీతాలనన్నిటిని చేర్చి పుస్తకరూపాన్ని ప్రకటించడంలో వారి ధర్మాన్ని వారు నెరవేర్చారు రైతాంగ గ్రంథమాలవారు.

## సంగీతోపాధ్యాయుని ' గానకళ '

శ్రీయుతులు గాలి పెంచలనరసింహారావుగారి గేయములపై మాకుఁగల ప్రేమాతిశయములను గుర్తించినవారగుటచే వారు 'గృహలక్ష్మి' పత్రికలోఁ బ్రకటించిన గేయములు మాకు బంపిరి.

వీరి కీర్తనలు, కర్ణాటక, హిందూస్థానీ, మరాటీ సంప్రదాయములలోని నిగ్గులతో ఆధునికాభిరుచుల కనుగుణ్యములగు పోకడలతో శ్రవణపేయములు, హృదయంగమములునై యున్నవి. మరియు వీరి గేయములలో గన్పించు కొన్ని యపురూపరాగములు ముమ్ముందు దేశమున మహాప్రచారము నందఁదగియున్నవి. గేయములతోఁబాటు స్వరతాళ సంజ్ఞలుకూడ కడు జాగ్రత్తగా, యుక్తముగాఁ బ్రకటించియుండుటచే అభ్యాసకులకిది కల్పవల్లి యనఁదగినది.

ఇంక సాహిత్యసందర్భమున వీరి నెంతైన నభినందించవలసియున్నది. కేవలాధునాతనులే గాక, పూర్వులు రచించిన యనేక గేయములలోకూడ ఉత్తమ కవిత్వము, నుత్తమ సాహిత్యము గానవచ్చుటలేదు. వీరి గేయము లట్లుగాక ప్రతిపదము రసభావస్ఫూర్తితోఁ బ్రకాశించుచుండుట యెంతయుఁ బ్రశంసనీయము. 'నిరాదరణమేలా? సరస్వతి! వరాలొసగిఁ బరిపాలింపవేలా?' అను నెత్తుబడి యెంత భావసమన్వితము! 'ఆశచేత ప్రతిమానవుడీధర ని - రాశజెందుగదవే మనసా' అను ఒక్క చరణమున జీవితరహస్యమంతయు వెల్లడింపబడినది కదా? 'కర్మానుభవముచే యింద్రియములు మర్మశులకు లోనైయుండుటచే ధర్మాధర్మ వివేకశూన్యుడై నిర్మాతను నిందించు మానవుడు' అను రచనమందలి శబ్దార్థసౌష్టవము వారి సహజకృతా మధురిమను వెల్లడింపలేదా? 'మనసా! వృథాగర్వమేలనే? మహారాజులైన మనుజుండె గాదా?' అను ఒక్కవాక్యములో ఒక లోకము, ఒక యుగము గోచరించుచున్నవి. ఇట్టి గుణసంపదకు కృషియు భగవత్ప్రసాదమునుఁగూడ నవసరము. భక్తులై గేయములు వ్రాసిన మహనీయులెల్లరు వేలసంఖ్యలో వ్రాసిరి. చిన్నతనముననే శ్రీ నరసింహారావుగారికిట్టి శక్తియుక్తులును, యిట్టి మనోభావములును గలుగుటచే భగవంతుడు వీరి మూలమున కళకును, దేశమునకు మహోన్నతి నుద్దేశించుట స్పష్టమగుచున్నది. కావున వీరును తదేకనిష్ఠతో నిట్టివే వేలకొలది గేయములను రచించి, తాము తరించి లోకమును తరింపఁజేయుదురుగాక.

(ద్వారం వెంకటస్వామినాయుడు, విశ్వనాథకవిరాజు.)

# పత్రికా పరిచయం

## కళ

'ఫిల్మ్ సర్విస్ కార్పొరేషన్' అనే సంస్థ పక్షాన వెలువడుతున్న సచిత్ర సినిమా మాసపత్రిక. సంపాదకులు: శ్రీ ఇంటూరి వెంకటేశ్వరరావుగారు, 40, ఎల్డమ్స్‌రోడ్, మైలాపూర్, మద్రాసు. సాలుచందా రు. 3. విడిసంచిక 4 అణాలు.

చక్కని ముఖచిత్రంలోటి, ప్రముఖుల వ్యాసాలతోటి పూర్తిగా ఆర్టుపేపరుమీదనే అచ్చుకావడం వల్ల పత్రిక చాలా ముచ్చటగావుంది. 'కొరడా' చణుకులు తీవ్రంగానే వున్నాయి. ఇది ఆంధ్రుల ఆదరణను పొంది కళాసేవచేస్తుందని ఆశిస్తాము.

## కథాంజలి వార్షిక సంచిక

సంపాదకులు: శ్రీ ఎ. యన్. రాఘవాచారిగారు, 32, కృష్ణప్పనాయక్ టాంక్ వీధి, జి. టి. మద్రాసు.

ఆంధ్రకథారచయితలు, పఠితలయొక్క ఆదరణాభిమానాలతో పెరిగి కథాంజలి మూడో సంవత్సరపు పండుగుచేసుకున్నది. ఈ శుభసమయమున మా ఆశీస్సుల నందజేస్తున్నాము. ఈసందర్భాన్ని పురస్కరించుకొని వెలువడ్డ వార్షికసంచిక, ముద్దులమూటగట్టు ముద్రణతోటి, ప్రముఖుల నాటికలతోటి, కథలతోటి, వివిధములైన చిత్రాలతోటి ముచ్చటగావుంది. విడిసంచిక ఒక అణా.




గోధుమలుతో తయారుచేయదగిన వివిధ పదార్థములు.

## గోధుమనూక పులగము

అర్ధశేరు పెసరపప్పును నీళ్లలో పావుగంటకాలం నానవేసి వడియకట్టి ఆరపోయవలెను. 40 తులముల కాగిన నేతిలో 1 శేరు గోధుమరవ్వను వేసి సుమారైదునిముషములు వేయించి ఆరపోసిన పెసరపప్పును వేసి కలుపవలెను. ఈ రవ్వ పెసరపప్పువున్న పాత్రలో మరుగుచున్న నీరు కొంచెము కొంచెముగా పోసి కలిపి మూతపెట్టవలెను. గోధుమరవ్వ మూడుపాళ్లు వుడికినతరువాత పావలాయెత్తు పసుపుపొడి, తులము జీలకర్ర 2 తులముల నానవేసి పొట్టుతీసిన తెల్లని మిరియాలు వేసి కలుపవలెను. తరువాత 2 తులముల వుప్పుపొడివేసి కలియపెట్టి క్రిందికిదింపి నిప్పులమీద మూడునిమిషములుంచవలెను. 32 తులముల కొబ్బరివేసి కలియపెట్టవలెను.

## రొట్టె చపాటి

30 తులముల గోధుమరవ్వ, 3 తులముల వెన్న, 3 తులముల మీగడ ఈ మూడింటిని తగు పాలతో కలిపి అరిచేతి వెడల్పున చీపురుపుల్ల మందమున రొట్టెలను చేసి యెర్రని నిప్పులమీద కాల్చవలెను.

## గోధుమపిండి రొట్టె

24 తులముల గోధుమపిండి 6 తులముల బియ్యపు పిండి పావుతులం వుప్పు వీటిలో తగిన మంచి నీరువేసి కలిపి అరిచేతి వెడల్పున రొట్టెలుచేసి పెనముమీద కాచి యెర్రని నిప్పులమీద కాల్చిన పొంగి మంచి రుచికరముగా వుండును.

## గోధుమరవ్వ బర్ఫీ

7 తులముల గోధుమరవ్వ 3 తులముల నెయ్యి 6½ తులముల పాలు, ఈ మూడింటిని కలిపి ముద్ద చేయవలెను. 30 తులముల నేతిని ఒక కళాయిలో పోసి నెయ్యి కాగినవెంటనే గోధుమపిండి ముద్దపిడుచలను వేసి వేయించవలెను. 120 తులముల పంచదార నొక కళాయిలో పోసి 1 శేరు మంచినీరు పోసి పొయ్యి మీద పెట్టి లేతపాకము రాగానే దింపవలెను. ఈ పాకములో గోధుమ పిడుచలను వేసి ముప్పావతిక తులము యేలకపొడి వేయవలెను. అంత ఒక పళ్లెములో పోసి ఆ పిడుచలను కత్తితో కోయవలెను.

—శ్రీ గోపరాజు వెంకటరత్నమ్మ.

# గోధుమ పూరీ

గోధుములు మెత్తగ విసరవలెను. ఆ పిండి జల్లించి ఒకశేరు పిండికి ఒకతులం కొట్టిన ఉప్పు, ఒక అరపంపు నెయ్యివేసి నీళ్లతో గట్టిగ సాయంత్రం కలపి వుంచవలెను. మరునాడు వుదయం ఆ పిండిని బాగా నేతితో మర్దించవలెను. తరువాత వుండలుచేసి పూరీ కొంచం దళసరిగ వొత్తి నేతిలో మాడనివ్వకుండా వేయించవలెను.

# గోధుమ హల్వా

ఒకశేరు గోధుమలు బాగుచేసి 4 శేర్ల మంచినీటిలో సాయంత్రం పోసి వుంచవలెను. మర్నాడు వుదయం గోధుమలను బాగా కడిగి రుబ్బి పాలుతీయవలెను. ఆ పాలను ఒక పల్చటిగుడ్డతో ఒక గిన్నెలోనికి వడగట్టవలెను. వడగట్టిన పాలను రెండుగంటలు కదపకుండా తేరనియ్యవలెను. పై నీటిని పారపోసినయడల చిక్కని పాలు మిగులును. ఆ పాలతో గేదెపాలుగాని ఆవుపాలుగాని నీళ్లు కలవనివి ఒక తవ్వెడు పోసి శేరు పంచదారనుకలిపి సన్నని మంటమీద కలియపెట్టవలెను. అరగంటకు కొంచం గట్టిపడును. దానిలో ఒక సోలడు నెయ్యి పోయవలెను. 15 నిమిషము లయినతరువాత 1 పంపు జీడిపప్పు, అరపంపు కిస్‌మిస్, 1 తులం ఏలకపొడి, 1 తులం కుంకుమపువ్వు వేసి బాగా కలియబెట్టవలెను. 10 నిమిషములకు బాగా గట్టిపడును. అప్పుడు ఒక పళ్లెమునకు నేయిరాచి దానిలో పొయ్యవలెను. ఒకగంటకు బాగా జున్నువలె గట్టిపడును. దానిని చాకుతో ముక్కలుచేయవలెను.

—శ్రీ సి. హెచ్. అన్నపూర్ణాబాయి.

# రవపుష్పా

నెయ్యి ½ ఫలం బాగుగా కాగినతరువాత ¼పడి గోదుమనూక కమ్మని వాసనవచ్చేవరకు వేపుకుని పిదప ఒకపళ్లెములో పోసుకోవలెను. నెయ్యి 2ఫలాలు బాగుగా కాగినతరువాత తుంచిన మిరపకాయలు 1/8ఫలం, ఆవాలు ¼ ఫలం, మినప్పప్పు ¼ ఫలం, నేతిలోవేసి, సగంవంతు వేగినపిదప, జీడిపప్పు ½ ఫలం పచ్చిమిరపకాయలు ¼ఫలం, అల్లం ¼ఫలం, పచ్చికర్వేపాకు ¼ఫలంవేసి బాగుగావేగిన పిదప ½ఫడి మంచినీళ్లు పోసి, ఆనీళ్లలో ½ఫలం ఉప్పువేసి బాగా మరిగినతర్వాత ఇష్టమైనవారు ఒకనిమ్మపండు రసంపిండి, పైన వేయించుకున్న గోదుమనూకను పోస్తూ కలియబెట్టవలెను. సగంవుడికినతర్వాత 2ఫలాల నెయ్యిపోసి బాగుగా కలిపి మూతపెట్టి సన్నని సెగమీద 5నిమిషములు వుంచవలెను.

—శ్రీ అనసూయాదేవి.

# పూరీ లడ్డు

½ వీశె గోధుమ పిండిలో ½ఫలం నెయ్యిపోసి అందులోచిటికెడు పొడిఉప్పువేసి తగుమాత్రం నీళ్లుపోసి ముద్దగా కలిపిపెట్టుకోవలెను. 10నిమిషములు నానినతర్వాత చేతితో బాగామర్దనంచేసి ఆపిండిని పెద్దవుసిరికాయంత వుండలుచేసి, ఒక్కొక్కవుండగా పీటమీదపెట్టి అప్పడాలకర్రతో పూరీ తయారు చేయవలెను. 15ఫలాలునెయ్యి బాగుగా కాగబెట్టి పైన ఒత్తిపెట్టిన పూరీని కాగిననేతిలో ఒక్కొక్కటిగా

వేసి చక్కగా తేల్చి పిదప ఒకపళ్లెములో యెత్తిపెట్టుకొనవలెను. పూరీలుఅంతా తయారయిన తర్వాత రోటిలోపోసి మెత్తగాదంచుకొని బూరాచక్కెర శ్రీవీశె పోసి మెత్తగాకొట్టి దానినితీసి ఒకగిన్నెలో వుంచుకోవలెను. పిదప జీడిపప్పు 1 ఫలం చిన్నచిన్న ముక్కలుగా తుంచుకుని బంగారుచాయగ నేతిలో వేపుకొని, దంచినపూరీలో దీనిని వేయవలెను. శ్రీఫలం చిన్నద్రాక్షపండ్లు దానిలోవేయవలెను. కుంకుమపువ్వు ఒకఅణాయెత్తు, ఒకవుద్ధరిణెపాలలో వేసి మర్దనంచేసి పైనచెప్పిన పూరీపిండిలో వేయవలెను. దానిని అంతా బాగుగాకలిపి మామూలు లడ్డువుండలుగా చేసికొనవలెను.

## హల్వా ఒబ్బట్లు

మంచి నెయ్యి ఒకసోలడు కాగినతర్వాత మూడుసోలల గోధుమనూక వేసి బాగాకలుపవలెను. అది కొంచెము ఎరుపు రంగు వచ్చేదాకా వేచితరువాత కిస్‌మిస్‌పళ్లు, బాదంపప్పు, యాలకుపళ్లగుండ వేసి, తవ్వెడు పంచదార, తవ్వెడు నీరువేసి, బాగా కలియపెట్టి మూతపెట్టవలెను. అది ఉడికిన తరువాత దించివేసి అరసోలడు నెయ్యివేసి, మనకు కావలసినంత ఉరవుగా ఉండలు కట్టవలెను. తరువాత పూరీలకు తడపినట్లు గోధుమ పిండితడపి, బాగుగా కలిపి హల్వా ముద్దలకు పొదుపవలెను. రొట్టెల పీటమీద వరిపిండివేసి, ఈ ముద్దలను ఒకొక్కటి చొప్పున రొట్టెలకఱ్ఱతో ఒత్తవలెను. ఒకొక్కటి చొప్పున ఒత్తగా వచ్చిన ఒబ్బట్లను, పెనము మీదవేసి నేయి కొంచెము వేయవలెను. ఒబ్బటు తిరిగ వేసినపుడుకూడ కొంచెము నేయి వేయవలెను. బాగుగా వేగిన తర్వాత, పెనుము మీదనుండి తీసివేయివలెను.

—శ్రీ ద్వారపు రత్నాబాయి

## --- పదార్థముల పట్టిక ---

ఆయామాసముల్లో మనకు లభ్యమయ్యే వస్తువులతో మనకు కావలసిన ఆహారపదార్థములు తయారు చేసుకొనేందుకు, ఆయా జిల్లావాసులగు సోదరసోదరీమణులు వారివారికి సరిపోవు పదార్థాలను వ్రాసిపంపిన వాటినన్నిటిని సమన్వయంచేసి, ఒక పట్టిక తయారుచేసి, ప్రకటించెదమని గతమాసపు 'గృహలక్ష్మి'లో ప్రచురించినాము.

కాని అందుకు తగునట్లుగా సరియైన విషయాలు మా కార్యస్థానానికి చేరలేదు. కాన యీ గడువును ఇంకొకమాసము పెంచినాము. కాన ఆగస్టు మాసమునకు సరిపోవు పదార్థములను వ్రాసి జూలై 20-వ తేదీలోగా పంపకోరుతున్నాము.

## రచయితలకు బహుమానము

గోధుమధాన్యముతో వివిధములైన పదార్థములను తయారుచేయదగిన పద్ధతులను, యీ పత్రికలో ప్రకటించినవిగాక క్రొత్తవి, సరియైన తూనికలతో, కొలతలతో, మంచి అనుభవజ్ఞానముతో ఎక్కువ పదార్థములను వ్రాసిపంపిన వారికి బహుమతి యొసంగబడును. కాన గమనింప కోరుచున్నాము.

# పుష్పచయము * * *

## ముస్లిం పెళ్ళిళ్లు

పెళ్లికి ముప్పైరోజులు ముందే పెళ్లికూతురికి నలుగులు మొదలుపెడ్తారు. ఆవపిండి, బార్లిపిండి, బాదంపిండి వీటితో నలుగులు, కళ్లకు కాటుక, గోళ్లకు గోరింటాకు వీరికి ముఖ్యము. ఆ నెలరోజులూ పెళ్లికూతురు తేలికగా జీర్ణమై బలమునిచ్చే పదార్థములనే పుచ్చుకోవాలి. దీనినే 'మాంజా' అంటారు.

### షెరా

అంటే పెండ్లికూతురికి లగ్నమప్పుడు చేయించే అలంకారము. నారింజరంగు జరీఅంచు మహతాపీ పిజమా, బాగా వదులైన చొక్కా తొడిగి, సన్నని పట్టురుమాలతో ముసుగు వేసుకోవాలి. ఈ దుస్తులు చేతితో చింపి కుట్టవలసిందే గాని కత్తిరించరాదు. కత్తెర ఉపయోగించితే ప్రేమానుబంధము తెగిపోతుందని వారి నమ్మిక. చమికీచేర్చిన పుష్పసరాలతో పెండ్లికూతురు ముఖమంతయు కప్పివేయాలి.

### గాజీలు

అంటే ముస్లిం పురోహితులు అరబ్బీభాషలో మంత్రములు చదువుతుంటే పెళ్లికూతురు పరదాచాటున నుండి 'ఈ వరుడు నీకిష్టమేనా' అని పెళ్లిపెద్దలు అడిగితే నెమ్మళంగా 'ఊఁ' అనాలి. తర్వాత పెళ్లికొడుకు ఆమె వెనుకప్రక్కగా వచ్చి ముందున్న నిలువుటద్దములో వధువు ముఖమును చూడాలి. అంతవరకు ఒకళ్లనొకళ్లు చూచుకోరాదు. ఆ సమయమున వధువు కళ్లు గట్టిగా మూసుకొనివుంటుంది. కనులువిప్పి చూడమని మఱీమఱీ వరుడు బతిమాలుకొంటే ఒక్కసారి కళ్లువిప్పిచూచి మరల మూసుకొంటుంది.

దీనికి తర్వాత 'రోషితి' అంటే అప్పగింతలు జరుగుతాయి. పెళ్లికూతురు తల్లి, తండ్రి, చుట్టాలు, అందరు ఆమెను వీడలేక దుఃఖిస్తూవుంటే, పెళ్లికొడుకు తటాలున ఆమెను ఎత్తి పల్లకీలో పెట్టుకొని వెళ్లిపోతాడు.—

## కాకినాడ స్త్రీ విద్యార్థినీ మహాసభ

శ్రీమతి వేదాంతం కమలాదేవిగారి అధ్యక్షతను కాకినాడ స్త్రీ విద్యార్థుల సభ జరిగింది. పట్టణమునందలి అన్ని విద్యాలయములనుండి సుమారు 70 మంది ప్రతినిధులు సభకరుదెంచారు.

కామ్రేడ్ పి. జగదాంబగారు (స్థానిక సోషలిష్టుపార్టీ కార్యదర్శి) విద్యార్థినుపతాకాన్ని ఎగరవేస్తూ, స్వాతంత్ర్యము, శాంతి, అభ్యుదయాలనుగురించి మాట్లాడారు. శ్రీమతి కమలాదేవిగారు పల్లెటూళ్లయందు అజ్ఞానాంధకారంలో మునిగి, మూఢాచారాల్తో కుళ్లిపోతున్న 100 కి 90 దేశస్త్రీలకు విద్యాదానం చేయుట ముఖ్యకార్యక్రమముగ పెట్టుకొని, ఉత్సాహముగ పనిచేయవలసినదని గంభీరముగ ఉపన్యసించారు.

తరువాత, శ్రీమతులు సుబ్రహ్మణ్యేశ్వరి, లలితా నాగుబాయమ్మ, స్వరాజ్యలక్ష్మి, బి. కాంతమ్మ, యామినీ పూర్ణతిలకమ్మగార్లు విద్యార్థినుల ప్రత్యేకసమస్యలు, కష్టములనుగూర్చి మాట్లాడారు.

## సత్యస్వరూపుడు గాంధీజీ

గాంధీజీ శిష్యురాలైన మీరాబేన్ మొన్న లాహోరులో మాట్లాడుతూ ఇలా చెప్పింది—"నేను యూరపులోను, అమెరికాలోను ప్రయాణించేటప్పుడు గాంధీజీ శిష్యురాలనన్నంత మాత్రంతో అందరూ నన్ను గౌరవించేవారు. ఒక పోర్టులో ప్రయాణీకుల సామానులన్నీ నిర్బంధంతో తనిఖీ చేస్తున్నారు. నామాట ముల్లే ఎవరూ ముట్టుకోలేదు. కారణం? ప్రపంచంలోకల్లా సత్యవంతుడైన వాని శిష్యురాలి మూటలలో తనిఖీచేయవలసినవి ఏమివుంటాయి? అని వారన్నారు." గాంధీజీ తనకు తానేకాకుండా తనచుట్టూవుండే వాతావరణాన్నికూడా పవిత్రంచేయగల పుణ్యమూర్తి అనే మాట అక్షరాలా సత్యం.

## సింధురాష్ట్రపు స్కూళ్లలో సంగీతం

సింధురాష్ట్ర విద్యాశాఖామంత్రి కోరికమీద భారతశాసనసభాసభ్యులైన జి. కే. సాబాక్ గారు సింధురాష్ట్రంలో సర్వసామాన్యంగా అంతా సంగీతం నేర్చుకోటం యెట్లా సాధ్యమవుతుందో ఒక విధానాన్ని తయారుచేసారు. ప్రైమరీ సెకెండరీ స్కూళ్లలో సంగీతాన్ని ఒక బోధనాంశంగా ఉంచి నేర్పాలని, కళాశాలల్లో శాస్త్రీయంగా విద్వత్తు కలిగేటట్లు నేర్పవచ్చునని వారు సూచించారు. అంతేగాకుండా యీ కాలంలో మామూలుగా అంతా పాడే రాగాలలో గానసమ్మేళనం యేర్పాటు చేయాలనికూడా వారి అభిప్రాయం. ప్రతి స్కూలులోను యీ ఏర్పాట్లను పెట్టి సంగీతాన్ని వృద్ధి చేయాలని కార్యక్రమం నిర్ణయించుకుని పనికి పూనుకున్నారు.

## పిల్లలు పుట్టటం ఆహారంమీద ఆధారపడి వుంటుంది

స్త్రీలకు ఆడపిల్లగాని, మొగపిల్లలుగాని కలుగుట చూలు యేర్పడ్డది మొదలు వారు తిను ఆహారముపై ఆధారపడి వుంటుందని, అమెరికన్ డాక్టరు మిల్లరుగారు చెప్పతున్నారు. కార్బొహైడ్రేట్సు హెచ్చుగావున్న పుష్టికరమైన పదార్థాలను తింటూవుండిన స్త్రీలకు ఆడపిల్లలే పుట్టారట, లేక చవుకైన తిండితిను బీదస్త్రీలకు మగబిడ్డలే పుట్టారట.

## స్త్రీ ఖైదీలకు వయోజన విద్య

మధ్యరాష్ట్రములందు, జైలులోనున్న ఖైదీలకుకూడ వయోజనవిద్య గఱపుటకై ఒక స్కీమును తయారుజేసినారు. పురుషులకు మాత్రమే ఆస్కీముయొక్క వుపయోగము. ఇప్పుడు స్త్రీ ఖయిదీలకు కూడ ఈ విద్య గఱపబడు చున్నది. సంయుక్త రాష్ట్రములో కాంగ్రెసు మంత్రిత్వం ఈ స్కీమును మొదట ప్రవేశపెట్టింది. మధ్యరాష్ట్ర కాంగ్రెసు మంత్రివర్గంవారు దానిని అనుసరించినారు. ఆ స్కీమునే యిప్పుడుగూడ సర్కారువారు అమలు జరుపుతున్నారు. చదువుకున్న ఖైదీయే విద్యా ప్రచారకుడు, బోధకుడు. రాత్రి 7 గంటల నుండి 8 గంటల వరకు కొందరికి, పగలు 7 గంటల నుండి 10 గంటల వరకు కొందరికి వంతులువేసి ఒక్కొక్క దళము ఖైదీలకు బోధనచేయబడుచున్నది.




## భిక్షావృత్తి సమస్య

భారతీయుల ధార్మిక ప్రవృత్తికి తార్కాణముగ నిలచియున్న యీ 'భిక్ష' నేడు కృషిదూరులైన సోమరుల జీవనోపాధియగుటవలన మన సాంఘికవ్యవస్థ ఎంత వక్రించినదియు సులభముగ గ్రహించవచ్చును.

నీచముగ పరిణామము జెందిన ఇది నేటి సాంఘికపరిస్థితులకు వేరుపురుగై సంఘమును బలహీన మొనరించుచున్నది. దీని నెట్లయినను నిర్మూలించవలెనని ప్రయత్నములు అక్కడక్కడ జరుగుచున్నవి.

ఇటీవల బెంగుళూరునందొకచోట ముష్టివాళ్లువచ్చి యాచించకూడదని నిషేధింప బడినది. నైజాము సంస్థానమందు దీని నరికట్టుటకు ఒక శాసనము త్వరలో అమలులోనికి రానున్నది. ఈ విషయమై గాంధిమహాత్ముడు గూడ, ఒకరిప్రశ్నకు జవాబుగ, దీనిని నిర్మూలించవలెనని వ్రాసియున్నాడు. ఇది శుభసూచకము.

ఈ బిచ్చగాండ్రలో శరీరదారుఢ్యము గలవారు, యాచనయే వృత్తియని జెప్పుకొనువారు, అంగ వైకల్యులు, రోగపీడితులు, మొదలగు రకరకములవారితో వీరు దినదినమునకు పెరిగి పోవుచున్నారు. శ్రమించి కృషిచేసి జీవనము సంపాదించుకొనుట మాని, కష్టములేకయే ఆర్జించుట కనువగు యీ వృత్తినే నవలంభిం చుచున్నారు. ఇందువలన సోమరితనము విపరీతముగ వృద్ధిజెందుచున్నది. ఇట్టి సోమరితనమున కాకరమై, మోసగాండ్రకు నిలయమైయున్న దీనివలన సంఘపతనము సంభవించుచున్నది.

ఇక, కుష్ఠు, క్షయ మొదలగు సాంక్రామిక రోగములు గలవారు వీరిలో అత్యధికముగ నున్నారు. వీరందరు విచ్చలవిడిగ తిరుగుటవలన యీ అంటువ్యాధులు సంఘములో నితరులకుకూడ వ్యాపించి తీవ్రరూపము దాల్చుచున్నవి. వికలాంగులు వీధులవెంటతిరుగుచు బాటసారులకు చీకాకు గలిగించుచు సంఘమును సభ్యతకు దూరము చేయుచున్నారు. మహాపిశాచమువలె నికృష్టరూపము దాల్చినదీనిని వెంటనే నామరూపములు లేకుండ నిర్మూలింపవలసియున్నది.

భిక్షాటనమే వృత్తిగాగలవారిని, శరీరపాటవమున్నవారిని నిర్బంధముగ నిషేధించి, తిరిగి వారీవృత్తి యందడుగిడిన శిక్షింపవలయును.

అంటురోగులనందరను ఒకచోట చేర్చి వారికి తగు వైద్యసహాయము నిచ్చి ఆరోగ్యవంతులను చేయవలయును. అంగవైకల్యులను వేరొకచోటచేర్చి, వారువారు చేయగలిగిన పరిశ్రమలను చేయించవచ్చును. అందువలన కొంతరాబడి కూడరాగలదు.

ఏదేశమునందును ఇట్టి తీవ్రరూపములోలేని ఇది మనదేశమందింకను నిషేధము కాకుండుట శోచనీయము. ప్రభుత్వము దీనకి వెంటనే పూనుకొనుట ముఖ్యధర్మము.

లేనినాడు ఉదారులైన ప్రత్యేకవ్యక్తుల యాధ్వర్యమున సంస్థలు స్థాపింపబడి, స్థానిక ప్రభుత్వముల యాదరణలో, ప్రభుత్వ శాసనములయొక్క సహాయమువలన నిరాటంకముగ వీటిని నిర్వహించవచ్చును. ఇట్టి

సంఘూపకారములకు సహకారమునిచ్చు సుహృదయులు మనదేశమందు చాలమందిగలరు. ఇట్టిది తలపెట్టిన సాడు, సహకార సహాయములకు ఎన్నడును వెలితిరాదు.

ఇది ఇప్పటి కెన్నడో జరుగవలసినకార్యమైనను, దినదిన ప్రవర్ధమానమగుచున్న దీనిని వెంటనే అరికట్టకపోయిన, అంటురోగము లతితీవ్రముగ వ్యాపించి, సోమరితనము విపరీతమై, సంఘము ఎట్టియుపద్రవము నెదుర్కొనవలసివచ్చునో యూహించవచ్చును.

ఈ దుస్థితిని పునర్నిర్మాణము చేయుటకుముందుగ ఒకవిషయము ముఖ్యముగ గమనించవలసియున్నది. ఎందుకు ఇంతమంది యాచించుచున్నారో ఆలోచించి ప్రతిక్రియచేయు టవసరము. వీరందరికి పనికల్పించి అన్నము పెట్టగలప్పుడే ఇదిసాధ్యమగును. ఈ తాత్కాలికోపశాంతికి వెనువెంటనే ఆర్థికస్థితిని సమముచేయుట చాలముఖ్యము. ఇప్పుడుచాలమంది ధనికులు, చాలమంది బీదలు ఉన్నారు. వీరి ఆర్థికస్థితి సమముచేసినగాని ఇది చక్కబడదు. ఆర్థిక బలహీనత దీనికి మూలకారణమైనను, దేశక్షేమముకోరు పెద్దలందరు వెంటనే యీ విషయమై ఆలోచనలుచేసి, తగువిధమున కట్టుబాట్లు చేయవలసియున్నది.

## యుద్ధము – భారతదేశము

పశ్చిమఖండమందు యుద్ధము తీవ్రరూపము దాల్చినది. నిరపరాధులగు ప్రజలనేకు లీపశుబలమున కాహుతియగుచున్నారు. చరిత్ర ప్రసిద్ధమైన పట్టణములు రూపుమాసి నామమాత్రావశిష్టమగుచున్నవి.

యుద్ధము ప్రారంభమైనప్పటినుండి ఒకటివెంబడి యొకటిగా 8 రాష్ట్రములు హిట్లరునకు దాసోహమన్నవి. ఫ్రాంసువంటి బలవత్తర రాజ్యముకూడ హిట్లరు కైవశముకాక తప్పినదిగాదు. ఇక హిట్లరు దృష్టి ఎటుమారునో దురవగాహముగనున్నది.

ఇటలీనియంత ముసోలినీకూడ మిత్రమండలిపై కత్తి దూసినాడు. ఫ్రాంసు ముగిసినతర్వాత అతని దృష్టి ఆఫ్రికను రాష్ట్రములవైపు మళ్లినది. దానిపై అమెరికాకూడ యుద్ధరంగమున ప్రవేశింపవలసిన కాలమాసన్నమైనది. అమెరికా అడుగుపెట్టిన జపానుకూడ యీ కార్చిచ్చులో కాలిడకమానదు.

వేరొకవైపున రష్యా బాల్కను రాజ్యముల నొకటొకటిగ ఆక్రమించుకొనుచున్నది. ఇట్టితరి ఈ నియంతల చర్యలు ఎప్పుడేరూపము దాల్చనున్నవో యూహించుట కష్టముగ నున్నది.

ఈ ప్రళయ సంక్షోభములో భారతదేశముయొక్క భావి ఎట్టి పరిణామము పొందవలసియున్నదో తెలియకున్నది. ప్రజా ప్రభుత్వరాజ్యముల పునరుద్ధరణకై పోరాడుచున్నట్లు ప్రకటించుచున్న ఇంగ్లండు, తనకు సామంతరాజ్యమైయున్న ఇండియాకు స్వాతంత్ర్యమును ప్రసాదించుట కిష్టపడుటలేదు. ప్రజాభిప్రాయమును తృణముగ నెంచి ఏడు రాష్ట్రములలో తన పరిపాలనమును నిర్విఘ్నముగ కొనసాగించుచున్నది నేడు.

తమ అధికారమును సుస్థిరముగ స్థాపించుకొనుటకై బ్రిటను భారతదేశమును నిరాయుధగ జేసినది; ఆర్థికబలహీనను చేసినది; దాస్య శృంఖలములలో కట్టివైచినది.

అర్థబలము, ఆయుధబలముకూడ లేని భారతదేశము ఇంగ్లండున కీసందిగ్ధసమయమున ఏవిధమున తోడ్పడగలదు? తనుదాను రక్షించుకొనలేని స్థితియందున్న భారతదేశముయొక్క సహాయము నపేక్షించిన ఇంగ్లండు భారతదేశమునకు స్వాతంత్ర్యమిచ్చి, ఆదేశముయొక్క సంపూర్ణ సహకారముల నొందుటకు ఇంకను ప్రయత్నింపకుండుట శోచనీయము.

భారతదేశమే స్వాతంత్ర్యయైననాడు బ్రిటనుకు అపారమైన సహాయము జేయగలదు. నియంతల రక్తపిపాస నరికట్టగలదు. ప్రళయభీకరమైన యీ వికృతాట్టహాసమునాపి సుస్థిరముగ శాంతి స్థాపింప సర్వవిధముల బ్రిటనుకు తోడ్పడగలదు.

బ్రిటన్ భారతదేశములు రెండును పరస్పర సహకారముతో నిలచిననాడు వీరి బలమజేయమగును.

## ఏటిధర్మమో ఇది ?

పిల్లలుగల తల్లి, ‘వెట్టియట్టిల్ కుంజికుట్టియమ్మ’ అనునామె, తన పిల్లలతోపాటు వెలివేయబడినది ఇటీవల కొచ్చిన్ సంస్థానములో. ఆమె తన సంతానముతో జాతిభ్రష్ట కావింపబడుటయే కాక, సవర్ణులుపయోగించు బావులు, చెరువులు మొదలగునవి ఉపయోగించుటకుకూడ నిషేధింపబడి, అస్పృశ్యులకంటెకూడ హీనముగ నిరసింపబడినది.

కొచ్చిన్ సంస్థానములో ‘ఇంరింజలకుడ’ అను గ్రామములో, ‘కుడల్ మాణిక్యం’ దేవస్థానపురోహితుడైన తాచ్చుడయ కైమాల్ కును ఈమెకును సంబంధమున్నందున, దేవాలయ పూజారి గుర్తించవలసిన బ్రహ్మచర్యదీక్షను కాపాడుటకు ఆమెను వెలివేసిరి. పూజారికి శాస్త్రరీత్యా ప్రాయశ్చిత్తము కావించి, నీతియుతముగ ప్రవర్తించు హామీమీద అతనిని ఆ దేవాలయమునకు తిరిగి పురోహితునిగ నియమించిరి. కొచ్చిన్ మహారాజు తరఫున దివానుగారైన సర్ షణ్ముగంచెట్టియార్ గారి ఈ ఫర్మానా, తగుమైన పోలీసు సిబ్బందితో అమలుజరుపబడినది.

పవిత్ర దేవస్థానములందు ఇట్టి అవినీతిపరులగు పురోహితులుండుటవలన జాతి, సంఘము పొందబోవు ఇహపరమోక్షముల మాట ఎట్లున్నను, అట్టివాని నరికట్టుటలో ఒక స్త్రీయే సంఘబలిమికి గురియగుట శోచనీయము.

తనకొరకు సంతానమును కని, తనకు స్వర్గసౌఖ్యముల ప్రసాదించుచున్నట్టి స్త్రీని అన్యాయముగ వంతలపాలుజేసి, ఆమె కష్టములపై ఫలితమనుభవింపజూచిన ఇట్టి పురోహితునివంటివారిని సహించిన సంస్థానమునందుగాని, దేశమునందుగాని ధర్మాధర్మములు లేవన్నమాట.

సంఘ నియమముల నతిక్రమించి, నీతిదూరములగు పనులు చేసినప్పుడు, పురుషునికి ఒక శిక్ష, స్త్రీకి ఒక శిక్ష విధించిన న్యాయశాస్త్రములో న్యాయములేదు. ప్రాయశ్చిత్తము పొందినంతమాత్రాన పునీతుడైన పురుషుని సహించిన సంస్థానము, సంఘము స్త్రీకిమాత్రము దారిచూపరాదా? సమానమగు పాపమొనరించిన అతడు తిరిగి దైవపూజచేయు నర్హుడా? ఇది సంఘద్రోహమే గాక దైవద్రోహము గాదా? ఏటిధర్మమో యిది? స్త్రీ అసహాయ, ఆర్థికముగా బలహీన, విశేషించి సంఘ క్రౌర్యపు బంధములలో చిక్కియున్నది. అట్టి తరి సరియగు న్యాయము నపేక్షించుటలో వివేకములేదు.

తచ్చుడయ కైమాల్ ఆమెను విడిచిపుచ్చకుండ ఆమెతోనున్నయడల విద్యాధికులు హర్షించెడువారు. కాని అతడు పురుషలోభత్వమునకు లోబడిపోయి, న్యాయాజ్ఞాన విచక్షణలేక, ఆమెను పాపకూపమున బడద్రోసి తాను సుఖపడదలచినాడు.

ఇటువంటి అక్రమమును చేతులార జరిపించిన కొచ్చిన్ మహారాజుగాని, దివాన్‌గాని అభినందనీయులు గాజాలరు. ఇట్టి చర్యలను సభ్యతా ప్రపంచమామోదింపజాలదు. ఇట్టి అన్యాయమునకు గురియైన ఆమెయొక్క నిట్టూర్పునందలి వేడి సంఘకల్మషములను దహించి వేయకుండునా?

**Edited by Dr. K. N. Kesari, Printed and Published by Dr. S. Seshagiri Rao, at the Lodhra Press, 15, Westcott Road, Royapettah, Madras.**